పెయింటింగ్ నేర్చుకోండి

**టీ.వీ.**

ప్రథమ ముద్రణ

జనవరి 1999

ప్రచురణ

**లిఖిత ప్రచురణలు**

విజయవాడ.

డి.టి.పి.

ఆర్. ఆర్. ప్రింటర్స్,

విజయవాడ-2.

ముద్రణ

స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్

విజయవాడ

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

**పల్లవి పబ్లికేషన్స్**

విజయవాడ -2.

వెల : **45/-**

TV

# రచయిత గురించి....

'టీవీ'గా అందరికీ తెలిసిన చిత్రకారుడు. కార్టూనిస్టులలో ప్రముఖ కార్టూనిస్టుగానూ. చిత్రకారులలో చిత్రకారుడుగానూ. రచయితగానూ, చిత్రకళా వుపాధ్యాయుడుగానూ. చిత్రకళల గురించిన రచయితగానూ, కళావిమర్శకుడుగానూ మనకందరకూ సుపరిచితుడు.



1944లో ఏలూరు (పశ్చిమ గోదావరి)లో జన్మించినా విశాలాంధ్రలో కార్టూనిస్టుగా చేరిన దగ్గర్నుంచి (1961) విజయవాడలోనే వుంటున్నాడు. చిత్రకళను స్వయంగా నేర్చుకున్నాడు. గురువులెవరూ లేరు. ఇంగ్లీషులో లభించిన పలు చిత్రకళా గ్రంథాలే తనకు గురువులంటాడు.

చిత్రకళలో ఈయన ఆల్‌రౌండర్. కార్టూన్‌లు, అడ్వర్టయిజ్‌మెంట్ డిజైన్‌లు, సినిమా పబ్లిసిటీ డిజైన్‌లు, వాల్‌పోస్టరులు, పుస్తకాల ముఖచిత్రాలు, ఇలస్ట్రేషన్‌లు, ఇంక్ స్కెచ్‌లు, వాటర్ కలర్ చిత్రాలు, ఆయిల్ కలర్ పెయింటింగ్‌లూ, స్మారక చిహ్నాలకు డిజైన్‌లూ, వివిధ సంస్థలకు ఎంబ్లమ్‌లూ, పోర్ట్రయిట్‌లూ - అన్నిరకాల చిత్రణలూ చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి. జామెట్రీ, పెర్‌స్పెక్టివ్ డ్రాయింగ్‌లలో కూడా అందెవేసిన చెయ్యి.

1981లో విజయవాడ మునిసిపల్ కార్పొరేషన్ వారు ప్రకటించిన ఎంబ్లమ్ పోటీలో పాల్గొని విజయం సాధించాడు. ఆయన గీసిన డిజైన్ వారి లోగోగా వాడుకలో వున్నది.

1983లో నవరంగ్ చిత్రకళా నికేతన్ నిర్వహించిన ప్రాంతీయ ప్రౌఢ చిత్రకారుల పోటీలో బంగారు పథకం గెలుచుకున్నాడు.

ఆయన చిత్రకళా ప్రదర్శనలు చాలాచోట్ల జరిగాయి. విశాఖపట్నం, విజయనగరం, శృంగవరపుకోట, రాజమండ్రి, ఏలూరు, తణుకు, విజయవాడ, తెనాలి, తిరుపతి, నూజివీడు, కొత్తగూడెం, హైదరాబాద్, న్యూఢిల్లీలలో ఆయన చిత్రాలు ప్రదర్శించబడ్డాయి. గత పదేళ్లుగా అనేక చిత్రకళా సంస్థలు జరిపే పోటీలకు న్యాయమూర్తిగా వెళ్లడం మామూలయిపోయింది.

ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుల గురించి తరచుగా పత్రికల ఆదివారం పేజీలలో రాస్తుంటాడు. ఇప్పటికి ఒక 50 వ్యాసాలు రాసి వుంటారు - విశాలాంధ్ర, ఆంధ్రజ్యోతి, ఆహ్వానం మాసపత్రికలలో ప్రచురించబడ్డాయి.

కార్టూన్‌లు ఎలాగీయాలి అనే వ్యాసాలు ఆంధ్రజ్యోతి వారపత్రికలో 34 వారాలు సీరియల్‌గా ప్రచురించబడ్డాయి. మద్రాస్ నుంచి తమిళం, తెలుగు, ఇంగ్లీషులలో ప్రచురించబడుతున్న "విజ్‌డమ్" అనబడే మాసపత్రికలో 40 నెలలు వరుసగా ఆ వ్యాసాలు పడ్డాయి. చిన్నారిలోకం, బాలజ్యోతి మాసపత్రికలకు డ్రాయింగ్ పాఠాలు చాలా రాశాడు. వివిధ దేశాలలో చిత్రకళ అభివృద్ధిని గురించిన వ్యాసాలు గత ఏడెనిమిది మాసాలుగా బెంగుళూరు నుండి కన్నడంలో వెలువడే మాసపత్రిక "దిక్సూచి"లో పడుతున్నాయి. ఆధునిక చిత్రకళలో వివిధ శైలులు, ధోరణులు గురించి వీరు రాస్తున్న వ్యాసాలు ఇరవైకి పైగా **"వనితాజ్యోతి"** మాసపత్రికలో వరుసగా 1995, 96లలో ప్రచురించబడ్డాయి.

చిత్రకళా వ్యాప్తికోసం విజయవాడలో **అకాడమీ ఆఫ్ క్రియేటివ్ ఆర్ట్స్‌**ను 1982లో స్థాపించాడు టీవీ. దానికి ఆయనే ప్రధాన కార్యదర్శి. ఐదు బృహత్తర చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించారు. గోష్ఠులు, వర్క్‌షాపులు, పిక్‌నిక్‌లు అనేకం అమలు చేశారు. అనేకమంది సీనియర్ చిత్రకారుల్ని సన్మానించారు ఆ సంస్థవారు.

అందుకే టీవీ ఎల్లప్పుడూ తీరిక లేకుండా ఏదో ఒక పనిలో నిమగ్నమయి వుంటాడు. తలనెరవకముందే అనేక సంస్థలచేత సన్మానాలు పొందాడు. విశాఖ చిత్రకళా పరిషత్, వెల్లటూరు నవరంగ్ చిత్రకళా నికేతన్, అమలాపురంలోని

కోనసీమ చిత్రకళా పరిషత్, విజయనగరం 'తెలుగు' సాహితీ సంస్థ, శృంగవరపుకోటలో అభ్యుదయ చిత్రకళా పరిషత్ మొదలగు సంస్థలచే సన్మానించబడ్డాడు.

1988లో సోవియట్ యూనియన్ వారి అంతర్జాతీయ పోస్టరు పోటీలో పాల్గొన్నాడు. ఆయన వేసిన పోస్టర్ డిజైన్లు మాస్కోలో జరిగిన ప్రదర్శనలో ప్రదర్శింపబడ్డాయి. 1989లో ఎ.ఫి.ఎస్. సంస్థ వారిచే ఆహ్వానింపబడి రష్యాలో పదిరోజులు పర్యటించాడు. లెనిన్‌గ్రాడ్‌లోని హెర్మిటాజ్ మ్యూజియంలోని గొప్ప చిత్రకారుల పెయింటింగ్‌లు చూశాడు.

1992లో ఆయన వేసిన కార్టూన్ ఒకటి మాస్కోలో ప్రింటయ్యే హాస్య వారపత్రిక "క్రొకడీల్"లో పడింది. సోవియట్ యూనియన్‌లోని పలు పట్టణాలనుండి, గ్రామాలనుండి అనేక ఉత్తరాలు వచ్చాయి టీవీకి.

కార్టూన్‌లలోనే గాక పెయింటింగ్‌లలో కూడా టీవీ సామాజిక స్పృహ గల చిత్రకారుడు. ఈ వ్యవస్థ పరిణామంలో ఉద్భవిస్తున్న సాంఘిక, రాజకీయ, ఆర్థిక సమస్యలపై స్పందించి చిత్రాలు వేస్తాడు. ఈయన చిత్రాలు భావగర్భితంగాను, సందేశాత్మకంగానూ వుంటాయి. సమాజం పట్ల చిత్రకారుడికి బాధ్యత వుండాలంటాడు టీవీ. అందుకే టీవీని ప్రజా చిత్రకారుడనీ, అభ్యుదయ చిత్రకారుడనీ అంటారు.

స్నేహితులను ఎదురుగా కూర్చోబెట్టుకొని పెన్సిల్ స్కెచ్‌లు వేయడం 1966లోనే మొదలుపెట్టాడు. తరువాత పెన్ స్కెచ్‌లూ, వాటర్ కలర్ పెయింటింగ్‌లూ వేశాడు. 1982లో మహాకవి శ్రీశ్రీ గారి ముందుకూచుని ఆయిల్ పెయింట్స్‌తో ఆయన చిత్రాన్ని చిత్రించాడు. 1993లో మాజీ మంత్రి శ్రీ ఎమ్.ఆర్. అప్పారావు గార్ని, 1994లో ప్రఖ్యాత చిత్రకారులు కొండపల్లి శేషగిరిరావు గార్ని వాటర్ కలర్స్‌తో వేశాడు. 1994లో సంజీవ్‌దేవ్ గార్ని నైఫ్ వర్కుతో ఆయిల్ కలర్స్‌లో చిత్రించాడు.

ప్రకృతి అందాలను కూడా అనేక స్టిల్ లైఫ్‌లలోను, లాండ్ స్కేపులుగానూ చిత్రించాడు. ఏదో ఒక ప్రాంతానికి ప్రయాణంచేసి వెళ్లడం అక్కడి ప్రకృతి దృశ్యాలను స్కెచ్‌లుగానో, పెయింటింగ్‌లుగానో వేయడం టీవీకి సరదా. ఆ విధంగా ఆయన వెళ్లటూరు, కొండపల్లి, చిలకలపూడి, అరకు, విశాఖపట్నం, గౌహతి, డార్జిలింగ్, షిల్లాంగ్, మైసూరు వగైరా ప్రాంతాల ప్రకృతిని లాండ్ స్కేపులుగా చిత్రించాడు.

నైరూప్య చిత్రణలో కూడా కొన్ని చిత్రాల్ని ప్రయత్నించాడు. ప్రజల జీవితాలను, శ్రామికుల జీవనాన్ని రియలిస్టు ధోరణిలో చిత్రించాడు. రాళ్లుకొట్టే కార్మికులు, రోడ్డు నిర్మాతలు, టింబరు కార్మికులు వగైరా ఎన్నో చిత్రాలు వేశాడు. ప్రజల సమస్యలను సింబాలిక్ పెయింటింగ్‌లలో చూపాడు. **"రేపిస్ట్ కిల్లర్"** చిత్రంలో అత్యాచారాలు జరిపే వాళ్లను, "బలిహారం"లో వరకట్నాలను, **"అన్నమయం"**లో ఆకలి చావులను చిత్రించాడు.

ఈ విధంగా పలు విధాలుగా, తనదైన శైలిలో టీవీ - చిత్రకళకు, తెలుగు ప్రజలకు సేవ చేస్తున్నాడు.

1979లో టీవీ **"చిత్రకళ శిక్షణ కేంద్రం"** పేరుతో సాయంత్రం తరగతులను, వేసవి తరగతులను నిర్వహిస్తున్నాడు. "చిత్రసూత్ర" కరెస్పాండెన్స్ కోర్సుల కేంద్రాన్ని పెట్టి మారుమూల ప్రాంతాలలో వున్నవారికి పోస్టు ద్వారా డ్రాయింగ్, పెయింటింగ్, కార్టూనింగు, డ్రాయింగ్ పరీక్షల కోర్సులను అచ్చ తెలుగులో పాఠాలు ప్రింటుచేయించి అందిస్తున్నాడు. ఆయన పాఠాలు విద్యార్థులకేగాక, డ్రాయింగ్ మాష్టర్లకూ పనికివస్తున్నాయనడంలో సందేహం లేదు. అనేకమంది ఔత్సాహిక చిత్రకారుల అభివృద్ధికి తోడ్పడుతున్నాడు.

టీవీ తన 40 సంవత్సరాల చిత్రకళ అనుభవంతో, తాను చదివిన అనేక చిత్రకళా గ్రంథాల పరిజ్ఞానంతో, 20 యేళ్ల చిత్రకళా బోధన అనుభవంతో ఈ పుస్తకాన్ని రచించాడు. తెలుగు భాషలో ఇలాంటి పుస్తకం యింతవరకు లేదు.

- పబ్లిషర్స్

# విషయ సూచిక

# సృష్టించడం ఒక అద్భుతం

సృష్టికి ప్రతి సృష్టిని చేస్తారు చిత్రకారులు. మన చుట్టూ వున్న ప్రకృతిని చిత్రించగలరు. వున్నదానినే కాదు లేనిదాన్ని కూడా సృష్టించగలరు.

క్రియేషన్ అనేది ఒక ఆనందం, అద్భుతం. తెల్లకాగితంపై ఒక దృశ్యాన్ని సృష్టించడం ఒక మ్యాజిక్. అది అందరికీ రాదు. అందుకే అది అద్భుతం. "గిఫ్ట్".

కానీ కుతూహలం వున్న వారెవరయినా క్రమశిక్షణతో కొంతకాలం సాధన చేస్తే డ్రాయింగ్, పెయింటింగ్ నేర్చుకోగలరు. 'సాధనమున పనులు సమకూరు ధరణిలో'.

అలాంటి కుతూహలం వున్న ఔత్సాహిక చిత్రకారులకు తోడ్పడుతుంది యీ పుస్తకం. వివిధ మీడియంలలో ఎలా ఎలా చిత్రించాలో వివరిస్తుంది. ఏయే పరికరాలు కావాలో తెలియజెప్పుతుంది. సృష్టించడానికి కావలసిన ఆలోచనలనూ, వుపాయాలను అలవాటు చేస్తుంది.

మీలో వున్న చిత్రకారుడిని తట్టి లేపుతుంది. తగిన తరిఫీదు ఇస్తుంది. అభివృద్ధి పథంలో పయనించి ముందుకు పోవడానికి సిద్ధం చేస్తుంది.

పెయింటిగ్‌ని నేర్చుకోవడం జీవితంలో ఒక ఆహ్లాదకర విషయం. అద్భుత విజయం. ప్రశాంతినిచ్చే తృప్తి. గర్వించదగిన జీవితానుభవం.

కొందరికి పెయింటింగ్ అనేది జీవన భృతికి కూడా పనికొస్తుంది. పెయింటింగ్‌లను చిత్రించి అమ్మవచ్చు. రాజారవివర్మగారి పెయింటింగ్‌లు ఎన్నో క్యాలండర్‌లుగా మారి అమ్ముడుపోతున్నాయి. ఎవరి ఆర్డరు పైనయినా పెద్ద పెద్ద భవనాలను రంగులతో అలంకరించవచ్చు. ఎం.ఎఫ్. హుసేన్‌గారు విమానాశ్రయాలను అలాగే అలంకరించారు తన పెయింటింగ్‌లతో. మాధవపెద్ది గోఖలే గారి లాగా సినిమా కళా దర్శకులుగా వుండి అనేక సెట్టింగ్‌లను రూపొందించవచ్చు పెయింటింగ్‌తో కనీసం సినిమా బ్యానర్లను పెయింట్ చేయవచ్చు. షోరూమ్‌లను రంగులతో అలంకరించవచ్చు. ఆడిటోరియం స్టేజీలను అలంకరించవచ్చు. అందమయిన పెయింటింగ్‌లు వేసి చిత్రకళా ప్రదర్శనలలో పెట్టి అమ్మవచ్చు. గ్రీటింగ్‌కార్డులు తయారు చేయవచ్చు. చీరలపై అందమైన డిజైన్‌లు వేసుకోవచ్చు. ఇలా ఎన్నో ప్రయోజనాలున్నాయి.

ఈ పుస్తకాన్ని శ్రద్ధగా చదివి, క్రమశిక్షణతో సాధన చేస్తే మంచి చిత్రకారులు కాగలరు. ఈ పుస్తకానికి ముందు "డ్రాయింగ్ నేర్చుకోండి" అనబడే మా మరో పుస్తకాన్ని చదివి వుంటే యింకా మంచిది.

# పరికరాలు

# PAINTING MATERIAL

## ముందుగా....

అందమైన ప్రకృతిని చూసిన వారికెవరికైన ఆహ్లాదం కలుగుతుంది. తాను చూసిన దాన్ని రంగులతో చిత్రించి ఇతరులకూ చూపించాలని కోరిక కలుగుతుంది. కానీ పెయింటింగ్ చేయడం తెలియకగానీ, పరికరాలు అందుబాటులో లేకగాని, కొనుక్కునే శక్తి లేక గానీ, నిరుత్సాహ పడిపోతారు. అలా బాధపడవలసిన పనిలేదు. కాస్త శ్రమపడితే పెయింటింగ్‌ని నేర్చుకొని సాధించవచ్చు. వివిధ రకాల పెయింటింగ్‌లను తెలుసుకుంటే అందులో మీకు తగిన, మీకు అందుబాటులో వున్న వాటితోనే మీ అభిలాషను తీర్చుకోవచ్చు.

పెయింటింగు అనేది సరదా (హాబీ)కే గాక ధన సంపాదనకూ పనికొస్తుంది. పోర్ట్రయిట్ పెయింటర్ కావచ్చు. లేదా కేలండరులకు, గ్రీటింగు కార్డులకు, పుస్తక ముఖ చిత్రాలకూ తగిన పెయింటింగులు వేయొచ్చు. పెద్ద ఎగ్జిబిషన్‌లోను, మ్యూజియంలోను మన కళాఖండాలను పెట్టి కీర్తిని, ధనాన్ని ఆర్జించవచ్చు: సినిమా బొమ్మల బ్యానర్ పెయింటరుగానో, సైన్‌బోర్డు పెయింటరుగానో జీవితాన్ని సునాయాసంగా వెళ్లబుచ్చవచ్చు. ఈ వృత్తులు సరదాగానూ వుంటాయి. ధనార్జనకూ పనికొస్తాయి.

పెయింటింగు అంటే వర్ణచిత్రకళ. గోడలకు రంగులు పూయడాన్ని కూడా "పెయింటింగు" అనే అంటారనుకోండి. ఇక్కడ వర్ణచిత్రణ అనేది మన అర్థం. అంటే బొమ్మలను రంగులతో వేయడం, రంగుల చిత్రాలను సృష్టించడం.

కళాశాల విద్యకు ముందు హైస్కూలు విద్య ఎలా అవసరమో మనకు పెయింటింగుకు ముందు డ్రాయింగు వచ్చి వుంటే చాలా మంచిది. మంచిదేమిటి? అవసరం.

## స్టూడియో :

నిరంతర సాధనకూ, ఎవరి డిస్టర్బెన్స్ లేని ఏకాగ్రతకూ ఒక రూమునో, ఒక యిల్లునో పెయింటింగు కోసం వాడుకోవడం మంచిది. దీనిని "స్టూడియో" అంటారు. మన పరికరాలూ, పనిముట్లు అన్నీ అందులో వుంటాయి. ఎవరో చెడగొడతారని భయంతో సర్దుకోవాల్సిన పనివుండదు. మన స్టూడియోలోకి మంచి వెలుగు

ప్రశాంతంగా వుండాలి. ముఖ్యం, మాకే పనిపోటయితే మంచిది. జన సంచారంలేని నిశ్శబ్ద వాతావరణం వుంటే మంచిది. మనం పెయింటింగు అయిపోయిన తర్వాత ఆ స్టూడియోకి తాళం వేసేసుకుంటాం గనుక పెయింటింగులు పాడయి పోతాయని భయం వుండదు. చాలామంది ఇలాంటి స్టూడియోలను ఆర్థిక స్తోమతులేక మెయింటేన్ చేయలేరు. అలాంటి స్టూడియో సౌకర్యంలేకుండానే పెద్ద ఆర్టిస్టులయిన వారు చాలామంది వున్నారు. కనుక అధైర్యపడకండి. ఏదో ఒక చోటుని, ఏదన్నా ఒక సమయాన్ని సమకూర్చుకొని అయినా పెయింటింగుని నేర్చుకోవచ్చు.

## పరికరాలు :

ఈ సమాగ్రి అంతా ఒకేసారి కొనుక్కోవలసిన అవసరం లేదు. ఈ పుస్తకంలో ఒక్కోరకం పెయింటింగుల గురించి ఒక్కోవ్యాసంలో చెప్పుకుంటాం. అప్పుడు అవి కొనుక్కుంటూ సాధన చేయవచ్చు. అన్నిరకాల పెయింటింగులలోను అవసరమయ్యే జనరల్ పనిముట్లను మాత్రం ముందుగా కొనుక్కుంటే చాలు.

హెచ్.బి. గాని హెచ్ గాని డ్రాయింగు పెన్సిలు, ఒక రబ్బరు, ఒక చవర రకం బ్లేడు ఎప్పుడూ వుండాల్సిందే. డ్రాయింగు బోర్డ్, ఈజెల్ (స్టాండు) ఎక్కువగా అవసరమౌతూ వుంటాయి. ఏయే రంగులు కావాలో, ఎలాంటి బ్రష్‌లు కావాలో, ఎలాంటి పేలెట్‌లు కావాలో తరువాత పాఠాల్లో తెలుసుకుందాం.

## GROUND భూమి :

పెయింటింగు దేనిమీద చేయబడుతుందో అంటే రంగులు దేనిమీద పూయబడతాయో దానిని "భూమి' అంటారు. ఆయిల్ కలర్స్‌కు కేన్వాసు గుడ్డ, నీటి రంగులకు కాగితం, ఎనామెల్ పెయింట్‌లకు చెక్కగాని రేకుగాని, డిస్టెంపరు పెయింట్‌లకు గోడలూ భూమిగా ఉపయోగపడుతున్నాయి.

ఆయిల్ పెయింటింగ్‌లకు కేన్వాస్ కావాలి. అది తెల్లని పెయింటు వేయబడిన ముదురు గుడ్డ, 'కేన్వాస్" అనే పేరుతో షాపులలో మీటరుల కొలతలో అమ్ముతారు. ముదుగు గుడ్డకు 'ప్రైమర్" అనే తెల్లని పెయింట్‌ని పూసి మనము కూడా కేన్వాస్‌ను తయారుచేసుకోవచ్చు. ఈ కేన్వాస్‌ను ఒక చట్రానికి బిగించాలి లేదా పెయింట్ చేయడానికి వీలుపడదు. మనకు కావలసినంత ఫ్రేము చేసుకొని దానికంటె కాస్త పెద్ద సైజులో కేన్వాసును కత్తిరించి ఆ ఫ్రేము నాలుగువైపులకూ కేన్వాస్ అంచులను బిగుతుగా లాగి మేకులు కొట్టాలి. ఇప్పుడు పెయింటింగుకు సిద్ధమయిందన్నమాట. ఆయిల్ కలర్స్‌ను ఆయిల్ స్కెచింగు పేపరుమీదగాని, ప్రైమర్ కోటింగు యిచ్చిన చెక్క మీదగాని కూడా వేయవచ్చు.

నీటి రంగులకు భూమిగా "వాట్‌మెన్ పేపర్" గాని హేండ్‌మేడ్ పేపరుగాని వాడుతాం. అది ఖరీదైనది మనం మామూలు డ్రాయింగు పేపరును ఎందుకు వాడం అంటే అది తడవగానే ముడతలు పడిపోతుంది. అలా ముడతలు పడిపోకుండా చేసుకునే ఉపాయం వుంది. ఇలా చేస్తే మామూలు డ్రాయింగు పేపరుకూడా నీటిరంగులకు పనికి వస్తుంది.

ఒక బల్లపైగాని, డ్రాయింగ్ బోర్డ్‌పైగాని డ్రాయింగ్ పేపరును పరిచి దానిపై బాగా తడిసిన గుడ్డనుగాని

స్పాంజినిగాని అద్దాలి. (గట్టిగా రుద్దకూడదు). అప్పుడు కాగితం ముడతలు పడుతుంది. మరల తడి గుడ్డతో ఆ ముడతలను సరిచేస్తూ ఆ కాగితాన్ని ఆ బల్లకే నాలుగు వేపులా గమ్‌టేప్‌తో అంటించి ఆరనివ్వాలి. అది ఇక తడిసినా ముడతలు పడదు. ఇక అది నీటి రంగులకు పనికొస్తుంది. ఖరీదైన కాగితాలు కొనకుండా మామూలు డ్రాయింగ్ పేపరును ఇలా చేసుకొని వాడవచ్చు.

నీటి రంగుల కోసం వాడే పేపరు ముక్కను డ్రాయింగు బోర్డ్‌కుగానీ. టేబుల్ మీద వాడే రైటింగు పేడ్ అనే అట్టకుగానీ పిన్స్ గుచ్చి అమర్చి పెయింటింగు చేసుకుంటాం.

## ఈజెల్ (EASEL):

ఈజెల్స్ అంటే స్టాండ్‌లు. చట్రానికి బిగించిన కేన్వాస్‌గాని, డ్రాయింగ్ పేపరు బిగించిన డ్రాయింగ్ బోర్డ్‌గానీ చిత్రించేటప్పుడు ఆనించి నిలబెట్టడానికి ఈ స్టాండ్‌ను వాడతాం. ఇవి చాలా రకాలుంటాయి. టేబులుపై పెట్టుకునేవి. కూర్చునివేసేవి, నిల్చుని వేసేవి, స్థిరంగా స్టూడియోలో వుంచేవి, ఎక్కడికయినా తీసుకెళ్ళగలవి (Portable Easel) రకాలుంటాయి. ఇనుపవిగానీ, చెక్కవిగానీ, అల్యూమినియంగానీ చేసినవే దొరుకుతాయి.



కొనుక్కోవచ్చు, లేదా చేయించుకోవచ్చు. ఈజెలును కొనుక్కోలేనివారు కేన్వాస్ చట్రాన్ని, లేదా డ్రాయింగు బోర్డ్‌ని టేబులుకో, గోడకో వాలుగా ఆనించి పెయింటింగు చేసుకోవచ్చు. ఈజెల్ లేకుండా చిత్రకారులయినవారు అనేకులున్నారు. కనుక ఈజెల్ లేనివారు బాధపడిపోనవసరం లేదు.

## మౌంటింగు, ఫ్రేమింగ్ (MOUNTING & FRAMING) :

వేసిన పెయింటింగు చూడచక్కగా వుండలానికి, నలిగి చెడిపోకుండా వుండటానికీ,గోడకు అలంకరించడానికి పనికి వచ్చే విదంగా Mount చేసుకుంటాం.

ఆయిల్ పెయింటింగు వేసిన కేన్వాసుకు Mount అవసరంలేదు. Frame యెలాచేయాలో చూద్దాం. కేన్వాసు బిగించివున్న చట్రానికే నాలుగు ప్రక్కలా చెక్క ఫ్రేమును వడ్రంగిచేత చేయించుకోవచ్చు. లేదా రంగు ఫ్రేములు కొనుక్కొని మనమే ఆ చట్రం చుట్టూ బిగించవచ్చు లేదా ఫ్రేములు వేసేవారిచే వేయించుకోవచ్చు. ఇళ్ళల్లో అలంకరించే దానికైతే ఈ ఫ్రేముతో బాటు అద్దం (Glass) వెయించుకోవచ్చు. ఆర్ట్ ఎగ్జిబిషన్‌లకు పంపేదయితే అద్దం వేయించవలసిన పనిలేదు. అద్దం వేయించిన పెయింటింగులను ఎగ్జిబిషన్‌లలో పెట్టుకోరు.

ఆయిల్ కలర్స్, వాటర్ కలర్స్, పేస్టెల్ కలర్స్, క్రేయన్ కలర్స్ మొదలగు రంగుల చిత్రాలు వేయబడిన కాగితాలకు మౌంట్‌చేసే విధానాన్ని పరిశీలిద్దాం. ఆ కాగితంకంటే పెద్ద సైజు అట్టనుగాని లేదా ప్లైవుడ్ చెక్కనుగానీ తీసుకోవాలి దాని మధ్యలో బొమ్మకాగితాన్ని అతికిస్తాం. అతికించేటప్పుడు తేమవల్ల అట్ట అయితే వంకరలు తిరిగి పోవచ్చు. ప్లైవుడ్ చెక్క అయితేనే మంచిది. ఇప్పుడు ఆ చెక్క సైజుదే మరొక రంగు అట్టని (కార్డుబోర్డుగానీ ప్లాస్టిక్ బోర్డుగానీ) తీసుకొని మధ్యలో పెయింటింగు కంటె కాస్త చిన్న ఖాళీని కట్ చెయ్యాలి. దీనిని ఆ బొమ్మమీదే అతికిస్తాం. ఈ విధంగా పెయింటింగుకు క్రింద చెక్కనూ, పైన రంగు అట్టనువేసి అతికించుతాం.



మన స్వంత ఉపయోగానికైతే Mount పైన గాజు పలకతో అద్దంతో ఫ్రేమును కట్టిస్తాం. లేదా గ్లేజింగు పేపరును అంటిస్తాం. ఎగ్జిబిషన్ల కయితే అద్దం లేకుండానే పంపించాలి. బొమ్మచుట్టూ మౌంట్ తగినంత పెద్దది వేస్తే బొమ్మకు అందం వస్తుంది. చీరకు అంచు అందం, అలాగనే ఇది కూడా.

వివిధ రంగుల వివరాలు, కావలసిన బ్రష్‌ల రకాల గురించి ముందు ముందు పాఠాలలో వివరించ బడుతుంది. ఏ రంగులకు యే మీడియం (నీరు, నూనె, వార్నిష్ వగైరా) వాడాలో కూడా ఆ పాఠాలలో తెలియజేయబడుతుంది.

## ఐడియాలు - మూడ్ :

పెయింటింగు వెయ్యాలని ఆపుకోలేనంత కుతూహలమూ, ఉత్సాహం ఒకోసారి వస్తుంటాయి. దానినే మూడ్ అంటాం. ఈ మూడ్ ఎప్పుడు వస్తుందో తెలుసా?

ఒక గేలరీలో గాని మ్యూజియంలోగాని కళాఖండాలను చూస్తున్నప్పుడు అలాంటి బ్రహ్మాండమయిన బొమ్మలను మనమూ వేస్తే బాగుంటుందని అనిపిస్తుంది. అందమయిన ప్రకృతిని చూసినా అలాంటి కోరిక కలుగుతుంది. ఒక్కోసారి సంధ్యావేళ రంగుల ఆకాశాన్ని చూస్తున్నప్పుడు; లేదా కొండలు, లోయలూ, సెలయేళ్ళూ, పచ్చని చెట్లూ కనపడినప్పుడూ ఆ అందమైన దృశ్యాన్ని వేద్దాం అనిపిస్తుంది.

అలవాటయిన కళాకారులకు మరీ తరచుగానే మూడ్ వస్తూంటుంది. సామాన్య వస్తువులను, సామాన్య జీవితాన్ని కూడా చిత్రించడానికి కుతూహలపడతాడు. అతనికి తెలుసు, అతి సామాన్యమైన వాటిని ఎవరూ చిత్రించరని. ఆ ఘనతను అతనే సంపాదిస్తాడు. అన్ని వస్తువులలోనూ అందాన్ని వీక్షించి దానిని అందంగా చిత్రించగల వారుంటారు. అనుభవం గడించినకొద్దీ మీరుకూడా ఆస్థితికి వస్తారు. కొంత మంది ఏకాగ్రతలో వుండి మంచి చిత్రాన్ని మనసులో వూహించుకొని దానిని చిత్రించ గలుగుతారు. ఒకోసారి పంచరంగుల కలను కంటాం. లేచింతరువాత దాన్ని చిత్రించాలని అనుకుంటాం. ఆ అందమైన కల మనల్ని వెంటాడుతుంది మరి. చిత్రించకపోతే కొన్నాళ్ళకి దానిని మర్చిపోతాం గదా?

## స్కెచింగు - నోట్సు :

ఏ షికారు వెళ్ళినప్పుడో మాంచి దృశ్యం కనపడిందనుకోండి. దాన్ని చిత్రిద్దాం అనిపించిందనుకోండి. మనవద్ద అప్పుడు రంగులు బ్రష్‌లు లేవు. అయినా బాధపడనవసరం లేదు. పాకెట్ బుక్‌లోనో సిగరెట్ పెట్టె అట్ట వెనుకనో పెన్సుతోనే ఆ స్కెచ్‌ని వేసుకోవచ్చు. ఆ స్కెచ్‌లోనే అవసరమయితే నోట్సు కూడా రాసుకోవచ్చు. ఎక్కడ ఏ రంగు వాడాలో నోట్ చేసుకుంటాం. ఇంటికొచ్చిన తరువాత ఇంటిలోనో, మన స్టూడియోలోనో కూర్చొని తీరుబాటుగా ఆ పెయింటింగుని పూర్తిచెయ్యవచ్చు. సుమారుగా మనం చూసిన సీనరీ తయారయిపోతుంది



# వర్ణసూత్రాలు

# COLOUR THEORY

ప్రకృతి అంతా రంగులమయం. కనుక వర్ణచిత్రాలు, ప్రకృతి సహజంగా, వాస్తవికత ఉట్టిపడుతూ వుంటాయి. చిత్రకారులు ప్రకృతిలోని వస్తువుల యొక్క రూపాన్నే గాక రంగునూ పరిశీలిస్తుంటారు. ఆయా వస్తువుల సహజ రంగులను గమనిస్తుంటారు.

రంగుల చిత్రాలు వాస్తవికత (Realism) తో బాటు అందాన్ని, ఆకర్షణనూ, అనుభూతి (Mood) నీ కూడా కలిగిస్తాయి. ఈ విషయాన్ని విశదంచేసేవే వర్ణ సూత్రాలు.

## రంగుల చక్రం :

బొమ్మలోని రంగుల చక్రాన్ని పరిశీలించండి. అందులో ఎరుపు, నీలం, పసుపు రంగులు ప్రాథమిక వర్ణాలు (Primary Colours). వీటిని శుద్ధ వర్ణాలనికూడా అంటారు. అవి యే రంగుల కలయిక చేతనూ ఏర్పడక, విడిగా వాటంతట అవే వుంటాయి. ప్రాథమిక వర్ణాలు కలిస్తే ఇతర రంగులు యేర్పడతాయి. ఈ మూడు ప్రాథమిక వర్ణాలతోనూ చిత్రించిన చిత్రం పరిపూర్ణంగా వుంటుంది. నిండుదనంతో వుంటుంది.

రంగుల చక్రంలోని పచ్చ, నారింజ, ఉదారంగులు ద్వితీయ వర్ణాలు (Secondery Colours), అవి ప్రాథమిక రంగుల కలయికచే రూపొందుతాయి. ఎరుపు, పసుపు రంగులు కలిస్తే నారింజ రంగు; పసుపు, నీలం రంగులు కలిస్తే పచ్చరంగు, నీలం, ఎరుపు రంగులు కలిస్తే ఉదారంగూ ఏర్పడతాయి.

రంగుల చక్రంలోని ఎదురెదురు రంగులను ప్రతికూల వర్ణాలంటారు. (Opposite Colours) ఎరుపు × పచ్చ, పసుపు × ఊదా, నీలం × నారింజ రంగులు ఎదురెదురుగా వున్న రంగులు. చిత్రకారులు రెండే రంగులు వాడవలసి వచ్చినప్పుడు ఈ జంటలలో ఏదో ఒకదానిని వాడతారు. ఎందుకంటే ఈ జంటలో ప్రాథమిక రంగులు మూడు దర్శనమిస్తాయి. ఎలా అంటారా? చూడండి. ఈ జంటలో దేనినయినా ఒక ప్రాథమిక వర్ణం, ఒక ద్వితీయ వర్ణం వున్నాయి కదా. ఆ ద్వితీయ వర్ణం కూడా రెండు ప్రాథమిక రంగుల కలయికేగా! ఉదాహరణకు ఎరుపు × పచ్చ వున్నాయి. ఎరుపు ఒక ప్రాథమిక వర్ణం. పచ్చలో రెండు ప్రాథమిక వర్ణాలున్నాయి. పసుపు, నీలం కనుక ఈ జంటలో మూడు ప్రాథమిక వర్ణాలూ మిళితమై వున్నాయి కదూ అందుకనే ఈ ప్రతికూల వర్ణాలనే పూరించే (Complimentary colours) రంగులు అని కూడా అంటారు.

రంగుల చక్రంలో వున్న రంగులను అదే వరుసలో ఒకదాని ప్రక్కన ఒకటిగా చిత్రిస్తే (Harmonious Colour Scheme) వరుసక్రమ రంగుల విధానం అంటారు. మేఘాలున్నప్పుడు ఆకాశంలో ఏర్పడే ఇంద్రధనస్సులో ఈ వరుసక్రమంలోనే రంగులు వుంటాయి. చిత్రాలలో ప్రేక్షకుల దృష్టిని నడపడానికి ఈ వరుసక్రమ రంగుల పద్ధతిని వాడుతారు. అంటే చిత్రం మీద పడిన దృష్టిని ఎటువైపు (Centre of interest వైపు) నడపాలో ఆటువైపు ఈ వరుస రంగులను వరుసగా వాడతారు. ఆ రంగులమీద దృష్టి నడుస్తుందని అలా చేస్తారు.

ఎరుపు, పసుపు, నారింజ రంగులను వెచ్చని వర్ణాలు (Warm Colours) అంటారు. ఎందుకంటే అవి సూర్యునిలాగా, అగ్నిలాగా వుంటాయి కాబట్టి. వాటిని చూడగానే వెచ్చదనం అనుభూతి కలుగుతుంది. వీటిని ముందకు వచ్చే రంగులు అని కూడా అంటారు. ఎందుకంటే అవి కొట్టవచ్చినట్లుగా ప్రకాశవంతంగా ముందకువచ్చి కనిపిస్తాయి. తెలుపు రంగుకూడా ముందుకు వస్తుంది.

నీలం, పచ్చా, ఊదా రంగులు చల్లని రంగులు (Cool Colours) వాటిని చూడగానే చల్లదనం అనుభూతి కలుగుతుంది. అంతేగాక అవి దూరంగా వెనక్కిపోయే రంగులు. ఆ రంగులలో లోతు, చీకటి కనిపిస్తుంది. నల్లరంగు కూడా వెనక్కిపోయే చీకటి రంగే.

తెలుపు, నలుపులను తటస్థ వర్ణాలు (Nutral Colours) అంటారు. వాటి మిశ్రమ మయిన బూడిద (గ్రే) రంగు కూడా.

రంగులను మనస్సులమీద ప్రభావముంటుందని, అవి అనుభూతులను (Mood) సృష్టిస్తాయని తెలుసుకోడానికి అనేక ఉదాహరణలున్నాయి. ఇదిగో చూడండి, ఎర్రరంగు చలనానికీ, రౌద్రానికీ, ప్రమాదానికీ, పోరాటానికీ సంకేతంగా వుంటున్నది. నీలం శీతలానికీ, నిజానికీ, శుభ్రతకీ చిహ్నంగా వుంది. నారింజ రంగు త్యాగానికీ, హుషారుకీ, ఆకర్షణకీ, చలనానికి చిహ్నం. పచ్చరంగు ప్రకృతికీ, పంటలకూ, అమాయకత్వానికీ, స్వార్ధానికీ చిహ్నం. ఉదారంగు హుందాతనానికీ, విచారానికీ, ప్రేమకీ చిహ్నం. పసుపురంగు వసంతానికీ, ఆశకీ, ద్వేషానికి చిహ్నం. తెలుపు పరిశుభ్రతకూ, శాంతికీ చిహ్నం. నలుపు భారానికీ, చీకటికీ, సంతాపానికీ చిహ్నం. అందుకే మనం ప్రముఖులు చనిపోయినప్పుడు నల్ల బ్యాడ్జీని పెట్టుకుంటాం. యుద్ధాలకు, పోరాటాలకు పిలుపివ్వడానికి రక్తంలా కనబడే ఎర్రజెండాలనూ, యుద్ధ విరమణలప్పుడు శాంతి చిహ్నమయిన తెల్లజెండా చూపించబడుతుంది.

## పంచరంగులు :

కొంతమంది చిత్రకారులు ఐదు రంగులుంటే చాలు, వాటిని ఉపయోగించి ఎన్ని రంగులనయినా సృష్టించి తమ చిత్రాలను పెయింట్ చేసుకోగలరు. ప్రాథమిక రంగులతో బాటు తెలుపు నలుపూ కలసినచో పంచరంగులు అన్నమాట.

చిక్కగా, దట్టంగా ఉన్న రంగులను Body Colours అనీ, Opaque Colours అనీ అంటారు. పోస్టర్ కలర్‌లూ, ఆయిల్ కలర్‌లూ య్యాక్రైలిక్ కలర్‌లూ ఈ రకమైనవే. వీటిని చిక్కగానే పెయింట్ చెయ్యాలి.

పలుచని రంగులను Transparent Colours అంటారు. వాటర్ కలర్‌లు,ఫోటో కలర్‌లు యిలాంటివే. వీటిని పలుచగా నీరు కలుపుకునే పెయింట్ చేయాలి. కాగితం రంగు (తెలుపు) కూడా కనబడుతూ వుంటుంది ఈ రంగులో నుంచి.

# రంగుల వివరం

వర్ణసూత్రాల ప్రకారం మూడు ప్రాధమిక వర్ణాలూ (ఎరుపు, పసుపు, నీలం) మూడు ద్వితీయ వర్ణాలూ (నారింజ, పచ్చ, ఊదా), రెండు తటస్థ వర్ణాలూ (తెలుపు, నలుపు) మిగిలనవన్నీ మిశ్రమ వర్ణాలూ. రంగులను కలుపుకునే వారికి ఈ సూత్రాలన్నీ కావాలి. రంగులను తయారుచేసేవారికి ఈ వివరం పనికివస్తుంది.

తెలుపు, నలుపును, ఈ రెంటికి కలయికతో యేర్పడే బూడిదరంగునూ న్యూట్రల్ కలర్స్ అంటారు. అంటే తటస్థ వర్ణాలు అని అర్థం.

కానీ ఈ రోజులలో బజారులో దొరికే ఈ నీటి రంగుల పెట్టెలో పండ్రెండుగానీ, పద్దెనిమిదిగానీ రంగులుంటాయి. ఆయిల్ కలర్స్ కూడా ముప్పయ్యో, నలభయ్యో రకాలు అమ్ముతారు. పోస్టరు కలర్లుకూడా అనేక షేడ్‌లలో అనేక పేర్లతో లభిస్తాయి. పేస్టెల్స్ కూడా 24 రంగులుండేవి. 48 రంగులుండేవి వున్నాయి. ఇన్ని రంగులెలా వచ్చాయి, వాటిని చూస్తేనే తెలుస్తుంది. కొస్త కొస్త తేడాతో పచ్చరంగులు ఐదారు వుంటాయి.వరిడియన్ గ్రీన్, శాప్ గ్రీన్, ఆలివ్ గ్రీన్, సీగ్రీన్ మొదలైన పేర్లతో వుంటాయి. అలాగే కొస్తకొస్త తేడా షేడ్‌లతో అనేక నీలిరంగులుంటాయి. కోబాల్ట్‌బ్లూ, ప్రష్యన్ బ్లూ, అల్ట్రా మెరీన్ బ్లూ, పీకాక్‌బ్లూ, స్కైబ్లూ, నేవీ బ్లూ, మొదలైనవి వున్నాయి. అలాగే ఎరుపు రంగులున్నాయి. వర్మిలియన్ రెడ్, క్రిమ్సన్, కార్మైన్, కాడ్మియంరెడ్, ఇండియన్ రెడ్, ఆలిజారిన్, రోజ్ మేడర్, సిగ్నల్ రెడ్, మొదలైనవి వుంటాయి. ప్రకృతిలో వాటి వాటి పోలికనిబట్టో, ఆ రంగు చేయబడిన పదార్థాన్ని బట్టో ఆ పేర్లు పెట్టబడతాయి. రంగుల పెట్టలలోని ట్యూబుల మీద పేర్లనూ, రంగు డబ్బాలమీద పేర్లనూ గమనిస్తూ వుంటే ఏ షేడ్ పేరు ఏదో అలవాటైపోతుంది. అవి వాడుకలోవున్న పేర్లు. ఆయా కంపెనీలవారు ఆయా షేడ్‌లకు పెట్టిన పేర్లు. వీటిని గుర్తుంచుకుంటే మంచిదే.

ఎన్ని రంగులుంటే అంత మంచిదని అనుభవంలేని దశలో చిత్రకారులు అనుకుంటారు. అనుభవజ్ఞులయితే కొద్ది రంగులతోనే ఎన్ని రంగులయినా తమ పెయింటింగ్‌లలో సృష్టించగలుగుతారు. కొందరికి పంచరంగులే చాలు. ఎరుపు, నీలం, పసుపు, తెలుపు, నలుపు అనేవి పంచరంగులు. వాటితోనే తమకు కావలసిన రంగులను తయారు చేసుకుంటారు.

ముందు అన్ని రంగులనూ వాడి చూండండి. అనుభం మీద మీరూ కొద్ది రంగులకే అలవాటు పడతారు. ఈ యేడు రంగులూ వుంటే చాలు అనో, ఈ ఎనిమిది రంగులే చాలు అనో మీరు ఒకనాడు నిర్ణయించుకుంటారేమో.

## CAMEL కంపెనీవారి వాటర్ కలర్ బాక్స్‌లో వున్న రంగుల పేర్లు :-

Carmine, Vermilion Chinese White, Ivory Black, Chrome Green, Veridian Green, Yellow Ochre, Lemon Yellow, Chromr Yellow, Burnt Sienna, Prusssian Blue, Cobalt Blue, Sepia, Raw Sienna, Raw Umber, Burnt Umber, Indian Yellow, Naples Yellow, Scarlet, Light Red, Magnta, Mauve, Indigu, Emarald Green, Sap Green, R etc.

## Camel Company వారి ఆయిల్ పెయింట్స్ ట్యూబ్స్‌లో వున్న రంగుల పేర్లు :-

Chrome Green Light, Paynec Grey, Scarlet Lake, Yellow Ochre, Viridian Green, Cobalt Blue, Ultramarine Blue, Raw Umber, Rose Madder, Crimson Lake, Prussian Blue, Cadmium Lemon, Flake White, Ivory Black, Burnt Sienna, Vandyke Brown, Magenta, Emarald Green, Indian Red, Mauve, etc.,

## British Paihts కంపెనీవారి ఎనామెల్ పెయింట్స్‌లోని రంగుల పేర్లు :-

Royal Jade, New Jade, Brilliant Green, Md. Bruns Green, Opaline Green Island Green, Water Green, Eau-de-Nil, Pale Cream, Lemon Yellow, Gloden Yellow, Golden Brown, Broken Whilte, Summer Rose, P.O.Red, Red Oxide, Signal Red, Dutch Blue, Sky Blue, Phiroza Blue, Azure Blue, Smoke Grey, Marini Grey, Silver Grey, Dk. Adm, Grey, Leaf Brown, Special Grey , Steel Grey, T.A. Grey, Olive Green, New Olive Gree, Cabinet Grey, Cabinet Olive, etc.,

## Camel Compamy వారి పోస్టర్ కలర్ల పేరు :

Poster White, Light Green, Poster Black, Silver, Olive Greenk, Pink, Poster Red, Cobalt Blue, Violet,Peacock Blue, Burnt Sienna, Chrome Lemon, Lemon Yellow, Orange, Mauve, Ultramarine Blue, Chrome Yelllow, Carmine, Vermilion, Burnt Umber, Medium Green,etc.,

## ఏ రంగులు కలిపితే యే రంగులు వస్తాయో యీ చార్టులో చూడండి :

(ప్రక్కనున్న అంకెలు పాళ్లను తెలుపుతాయి)

White 5 + Black 1 = Light Grey
White 3 + Black 1 = Deep Grey
White 5 + Lemon Yellow 1 = Pale Grey
Chrome Yellow 1 + White 5 = Buff
White 5 + Vermilion Red 1 = Salmon Pink
White 5 + Crimson Red 1 = Rose
White 5 + Mauve 1 = Cerise
White 5 + Cobalt Blue 1 = Sky Blue
Lemon Yellow 5 + Chrome Yellow 3 = Chrome Lemon
Lemon Yellow 5 + Vermilion Red 2 = Lemon Orange.
Chorme Yellow 5 + Vermilion Red 2 = Chrome Orange
Chorme Yellow 5 + Vermilion Lion 2 = Scarlet Lake
White 5 + Crimson Red 1 = Scarlet Lake
Yellow Orche 5 + Burnt sienna 2 = Raw Sienna.
White 5 + Green Bice 3 = Beaf Green
Black 5 + Yellow Orche 2 = Vandyke Brown
Lemon Yellow 5 + Green Brse 2 = Light Green
Prussian Blue 5 + Chrome Yellow 2 = Dark Green.
Mauve 3 + Prussian Blue 2 = Violet.
Cobalt Ble 3 + Vermilion Red 1 = Suffron.
Chrome Yellow 1 + Crimson Red 2 = Signal Red
VermilionRed 1 + Cobalt Blue 1 = Chorelate
Crimson Red 1 + Cobalt Blue 1 = Purple Brown
Vermilion Red 1 + Green Bite = Sarvice Brown.

# పెయింటింగుల రకాలు

## SEVERAL PAINTINGS

పెయింటింగ్‌లు కాగితాలమీదనేగాక గోడలమీద, చెక్కలమీద, గుడ్డమీద, రేకుమీద, అద్దముమీద కూడా వేయబడుతుంటాయి. పెయింటింగ్ వేయబడే చోటును గ్రౌండ్ అనీ, భూమి అనీ అంటారు. పెయింటింగ్ వేయబడే గ్రౌండును బట్టి యే పెయింట్లు వాడాలో - అంటే యే మీడియం పెయింట్లు వాడాలో నిర్ణయించుకుంటాము. మనము వేసే పెయింటింగ్ యొక్క గ్రౌండు కాగితమే అనుకోండి. దానికి వాటర్ కలర్ లేక పోస్టర్ కలర్ మీడియంలు పనికివస్తాయి. గరుకు కాగితంమీద పెయింట్ చేయవలసివస్తే దానికి క్రేయాన్స్ లేక పేస్టెల్ కలర్స్ పనికివస్తాయి. పెయింటింగును గుడ్డమీద వెయ్యాల్సి వుందనుకోండి అప్పుడు ఆయిల్ పెయింట్ మరియు ఫ్రేబ్రిక్ పెయింటు మంచిది. ఈ విధంగా సాధారణంగా భూమిని బట్టి రంగులను యెంచుకుంటాము.

గుడ్డ : పెయింటింగ్‌లు వేయడానికి గుడ్డలు అనేకసార్లు వాడతాం. చెక్క ఫ్రేముకు గుడ్డను బిగించి ఆయిల్ పెయింటింగ్‌లు వాడతామని మీకు తెలుసు. ఇదే విధంగా సినిమా బ్యానర్లు కూడా చెక్క ఫ్రేమును బిగించబడిన గుడ్డల మీదే వేస్తారు. నాటకాల స్టేజి వెనుక వేలాడగట్టే బ్యాక్‌డ్రాప్ సీనరీలు కూడా గుడ్డమీదనే వేస్తారు. రోడ్లకు అడ్డంగా కట్టే సుస్వాగతం బ్యానర్లు లేక అడ్వర్టయిజ్‌మెంట్ల బ్యానర్లు కూడా గుడ్డమీదనే వేస్తారు. సాధారణంగా ఇలాంటి వాటికి ఆయిల్ కలర్స్‌నే వాడతారు. ముందు చెక్క ఫ్రేముకు బిగించిన గుడ్డమీద వుడకబెట్టిన సర్వీస్‌ను వెడల్పాంటి పెయింట్ బ్రష్‌తో పూస్తారు. ఈ సర్వీసుతో చాక్‌పొడరు కూడా కలుపుతారు. ఈ సర్వీసు ఇనప కొట్లలో దొరుకుతుంది. సర్వీసు కోటింగ్ ఆరిన తరువాత నూనెలో కలిపిన రంగులతో పెయింటింగ్ చేస్తారు. ఈ రంగులు కూడా గుండ (పొడర్) రూపంలో ఇనుప కొట్లలో లభిస్తాయి. మరగబెట్టిన (Double Boiled) ఆవిశ (Linseed Oil) నూనెను కలుపుకొని ఈ రంగులను పూస్తారు. ఇదంతా ఆయిల్ పెయింటింగ్ విధానమే. ఈ డబుల్ బాయిల్డు నూనె కాస్త తొందరగా ఆరిపోతుంది. 8 గంటలలోనే ఆరిపోతుంది. మనము మామూలుగా ఆయిల్ పెయింటింగ్‌లో వాడేది పచ్చి ఆవిశనూనె. అది ఆరడానికి రెండు రోజులు పడుతుంది. ఈ నూనె రంగులు వర్షములో నానినా కరిగిపోవు.

గుడ్డలమీద పెయింటింగ్‌కు నీటి రంగులు కూడా వాడొచ్చు. నీటి రంగులు వాడే ముందు సర్వీసు పూత పూయనవసరం లేదు. పొడి రంగులను నీటితో కలుపుకొంటాము. అందులో కాస్త సర్వీసు నీరో,

తుమ్మజిగురు నీరో కలుపు కొంటాము. అప్పుడు ఆ రంగు గుడ్డకు అంటుకొంటుంది. ఈ విధంగా రంగుల్లో నీరూ, జిగురు కలుపుకొంటూ వాడతాము లేకపోతే యీ రంగులు వర్షంలో నానితే కరిగిపోతాయి.

గుడ్డమీద ఎనామెల్ పెయింట్‌లు వాడితే అది మరీ అట్టలాగయిపోయి గుడ్డను చుట్టవలసివస్తే వంగదు. అందుకని ఎనామెల్ పెయింట్లు సాధారణంగా వాడరు.

గుడ్డమీద డిజైనులు వేసుకోవడానికి ఫాబ్రిక్ పెయింట్లనేవి లభిస్తున్నాయి. ఇవి వివిధ రంగులుగా సీసాలలో దొరుకుతాయి. గుడ్డమీద డైరెక్టుగా బ్రష్‌తో వేసుకోవచ్చు. బాగుంటాయి. కానీ ఖరీదు ఎక్కువవుతుంది. చీరలమీద డిజైన్‌లు వేసుకోవడానికి ఈ రంగులను వాడుతున్నారు.

**గోడ :** ప్రాచీన కాలం నుండీ గోడలమీద పెయింటింగ్‌లు వేసే అలవాటు వున్నది. అజంతా, బాగ్ గుహలలోని పెయింటింగ్‌లు గోడలమీదనే వున్నాయి. ఇటలీలో ప్రఖ్యాత పెయింటింగ్‌లు చర్చిల గోడలమీదే వేయబడ్డాయి. గోడలమీద కూడా అనేక మీడియంలతో పెయింటింగులు వేయవచ్చు. అందుకు తగినట్లుగా గోడను ముందు సిద్ధం చేయాలి. దీనిని ప్రైమరు వేయడం అంటాము. వివిధ రకాల రంగుల (మీడయం)కు వివిధ రకాల ప్రైమరులు వాడతాం. ఎనామెల్ పెయింట్స్ వాడటానికి ముందు సిమెంట్ ప్రైమరును పెద్ద బ్రష్‌తో పూస్తాం. లేదా డిస్టెంబరు తెలుపురంగును పూయవచ్చు. అది ఆరిన తరువాత ఎనామెల్ పెయింట్స్ (వార్నిష్ పెయింట్స్)ను పెయింట్ చేయవచ్చు. ఇవి చాలా గ్లేజింగుగా అందంగా అద్భుతంగా వుంటాయి. వర్షానికి నానిపోవు ఇవి చాలా ఖర్చుతో కూడినవి.

గోడలమీదా నీటి రంగులను వేయవచ్చు. చాలా చవక గూడా. గోడమీద ముందు సిమెంటు సున్నాన్ని పూస్తారు ఆ తరువాత పొడరు రంగులను నీటితోనూ, సర్వీసు జిగురుతోనూ కలుపుకొని బ్రష్‌లతో పెయింట్ చేయవచ్చు. ఈ రంగులు వర్షంలో నానితేపోతాయి. చినుకులకు, మంచుకు అంతగా చెడిపోవు. ఇళ్ల లోపలికయితే ఫరవాలేదు.

బిల్డింగ్‌ల గోడలకు సున్నము, గోపీకలర్ లాంటి చవక రంగులకు బదులు కొంత విలువైన అందమైన రంగులు వాడదామనుకునేవారికి డిస్టెంపరు రంగులున్నాయి. అవి వార్నీషు రంగులంత ఖర్చు కాదు. బిల్డింగ్‌కు సిమెంటు సున్నం వేసింతరువాత ఈ రంగులను దేనికదే ఒకో రంగునూ బకెట్‌లలో నీటితో కలుపుకొని పెద్ద పెద్ద బ్రష్‌లతో గోడలకు పూస్తారు. ఈరంగులన్నీ లేతగా వుంటాయి. అంటే అన్ని రంగులలోనూ కొంత తెలుపు కలిసి వుంటుంది. ఈ డిస్టెంపరు రంగులలో చాలా రంగులుంటాయి. గులాబి, పచ్చ, పసుపు, లేత ఎరుపు, లేత నీలం, ఊదా మొదలయినవి వుంటాయి డార్కు రంగులుండవు. ఈ రంగులయితే పెయింటింగ్‌లుగానీ, డిజైన్‌లుగానీ కూడా వేసుకోవచ్చు. ఈ రంగులు వర్షానికి కూడా చెదరవు.

**రేకు :** సైన్ బోర్డులు ఇనుప రేకుతో చేయబడతాయి. వాటిమీద ఎనామెల్ (వార్నీషు) పెయింటే వేస్తారు. ఇంకే పెయింటూ రేకుమీద అంటదు. జారిపోతుంది. ఈ వార్నీషు రంగులు ఇనపకొట్లలో లేదా పెయింట్ల షాపుల్లో డబ్బాలలో దొరుకుతాయి. ఎనామెల్ పెయింట్స్ అనికూడా అంటారు. ఈ పెయింట్

వేసేముందు రేకును తుప్పులేకుండా దుమ్ము ధూళీ లేకుండా ఇసుక పేపరుతో (ఎమిరిపేపరు) తుడిచి శుభ్రం చేయాలి. ఆ తరువాత ప్రైమరును (రెడాక్సైడ్) పూయాలి. ప్రైమరు కూడా ఇనపకొట్లలో దొరుకుతుంది. అది ఆరింతరువాత వార్నీషు రంగులను బ్రష్‌లతో వేసుకుంటాము. ఈ రంగులు వర్షానికి పాడయిపోవు.

చెక్క : సైన్ బోర్డులకూ, పెయింటింగ్‌లకూ ప్లెయివుడ్ చెక్కలనో, మరేదైనా చెక్కలనో వాడుతూ వుంటారు. వాటిపైన కూడా వుడ్ ప్రైమర్ అనేదాన్ని ముందు పూసి అది ఆరింతరువాత పెయింట్ చేస్తారు. చెక్క యొక్క సహజమైన రంగే కావాలనుకునేవారు ప్రైమరు పూయకుండా పాలిష్ కోటింగ్ ఇస్తారు. తరువాత ఎనామెల్ పెయింట్స్‌గానీ, ఆయిల్ పెయింట్స్‌గానీ వాడవచ్చును. అవి చెక్కను అంటుకుపోతాయి. చెక్క వర్షంలో నానినా చెక్క పాడవ్వవలసిందే గాని రంగు పోదు. ఈ చెక్కలమీద కూడా నీటి రంగులు వాడరు వాడినా శాశ్వతంగా వుండవు చెక్కను అంటుకొని వుండక రాలిపోతాయి. కొండపల్లి బొమ్మలకు నీటి రంగులనే వేస్తున్నారు. చెక్కతో చేసిన బొమ్మలకు లక్క పెయింట్లు వేస్తే అవి ఎంతో ముచ్చటగా వుంటాయి. ఏటికొప్పాక బొమ్మలు లక్క రంగులతో నిగనిగలాడుతుంటాయి.

**అద్దము** : గాజు ఫలకలమీద పెయింటింగ్ చేసేవారు వార్నీష్ రంగులనూ, ఆయిల్ పెయింట్లనూ వాడవచ్చు. అద్దముమీద ప్రైమరు వేయాల్సిన అవసరం లేదు. బజారుల్లోని షాపుల షోకేస్‌లమీద, అద్దాలమీద పెయింటు చేసేవారు చక్కని ఎనామెల్ పెయింట్లనే వాడుతారు. ఆరినకొద్దీ అవి గట్టిగా అంటుకొంటాయి. మెరుస్తూ వుంటాయి. అద్దం మీద యాక్రైలిక్ పెయింట్ కూడా వేయవచ్చు.

# పెయింట్‌ల రకాలు

రకరకాల అవసరాలకోసం రకరకాల మీడియంలలో పెయింట్‌లు తయారవుతున్నాయి. కొన్ని నీటి రంగులు, కొన్ని నూనె రంగులు, కొన్ని వార్నిష్ రంగులుగాక ఇతర రకాలూ ఈ రోజులలో ప్రవేశ పెట్టబడుతున్నాయి. పెయింటర్‌కు రంగులు కలుపుకొనే శ్రమ లేకుండ వివిధ మీడియంలలో వివిధ షేడ్‌లను తయారుచేసి రకరకాల పేర్లతో అమ్ముతూవున్నారు.

## నీటి రంగులు

ముందు నీటి మీడియంతో చేయబడిన రంగులను పరిశీలిద్దాం. ఇవి నీటితో కలుస్తాయి. పలుచన చెయ్యాలన్నా, రెండేసి రంగులను కలపాలన్నా, బ్రష్‌లు కడుక్కోవాలన్నా నీరు వాడవచ్చు. కనుక ఈ రంగులు వర్షంలో నానిపోయే ప్రమాదం వుంది.

**1. వాటర్ కలర్స్ :**

ఇవి బిళ్ళలరూపంలోనూ, ట్యూబుల రూపంలోనూ, "వాటర్ కలర్స్" అనే పేరుతో ఫ్యాన్సీ షాపులలో లభిస్తాయి. ఈ రంగులు ఎండిపోతే నీరు కలపవచ్చు. ఈ రంగులు కాగితంమీద వేయడానికి పనికివస్తాయి. ఇవి చాలా కాలం మన్నుతాయి. కాగితం చెడిపోకుండా వుండాలిగాని ఇవి పాడవవు.

పౌడర్ల (గుండ) రూపంలో ఇనుపకొట్లలో కూడా ఈ రంగులు దొరుకుతాయి. వాటికి నీరుకలిపి వాడవచ్చు. గోడలమీద వేయడానికీ, గుడ్డమీద వేయడానికీ ఈ రంగులు వాడవచ్చు. ఇవి చవుకగా లభిస్తాయి. గుడ్డమీద వాడే టప్పుడు కొంత నీరు కలిపిన సర్ఫ్‌సును కలిపితే ఈ రంగు గుడ్డకు అంటుకోవానికి తోడ్పడుతుంది. లేదా తొందరగా రాలిపోతుంది. ఈ రంగులు గోడమీద వాడేముందు ఈ గోడమీద సిమెంట్ సున్నం పూస్తే మంచిది.

**2. పోస్టరు కలర్స్ :**

ఇవి చిన్న చిన్న గాజు సీసాలలో చిక్కని ద్రవరూపంలో లభిస్తాయి. నీరు కలుపుకొని వాడొచ్చు. ఎండిపోయినా నీరు కలపవచ్చు. కాగితంమీద వాడొచ్చు. ఇవి మందపు రంగులు. ఇవి ఎండిన తరువాత పెచ్చులు పెచ్చులుగా రాలిపోతాయి. శాశ్వతంగా వుండే పెయింటింగ్‌లకు ఇవి పనికిరావు. తాత్కాలికంగా కమర్షియల్ ఆర్టులో పోస్టరు డిజైన్‌లకు, బుక్ టైటిల్ డిజైన్‌లకు వాడవచ్చు. ఈ రంగులకు సేబుల్ హెయిర్ బ్రష్‌లు వాడతారు. ఈ రంగులు వాడిన బ్రష్‌లను నీటితో క్లీన్ చెయ్యవచ్చు.

**3. ఫ్యూజీ కలర్స్ :**

ఇవి ఆర్ట్ మెటీరియల్ అమ్మే చోట్గా, ఫోటోగ్రాఫిక్ మెటీరియల్ అమ్మేచోటా లభిస్తాయి. ఈ రంగులు కాగితానికే అంటుకొని వుంటాయి. ఈ రంగు కాగితాన్ని కాస్త చించి నీటిలో వేస్తే ఈ రంగు కరుగుతుంది. తగినంత నీరు వేసుకోవాలి. ఈ పలుచని రంగులను ఫోటోగ్రాఫ్‌లమీద సేబుల్ హెయిర్ బ్రష్‌లతో దిద్దుతారు. నలుపు తెలుపు ఫోటోలను వీటితోనే రంగుల ఫోటోలుగా మారుస్తారు. సినిమా స్లైడులు చేయడానికీ కూడా ఈ రంగులను వాడుతారు. ఈ బ్రష్‌లనూ నీటితో కడిగివేయవచ్చు.

**4. డిస్టెంపర్ కలర్స్ :**

నీరును కలిపి గోడలకు వేసే రంగులేయివి. బిల్డింగ్‌లకు అందంగా పూయవచ్చు. ఇవి వేసేముందు వైట్ సిమెంట్‌ను గోడలకు వేయాలి. అది ఆరింతరువాత ఈ రంగులను పెద్ద పెద్ద బ్రష్‌లతో పూయవచ్చు. ఈ రంగులు, బ్రష్‌లూ ఇనుపకొట్లలో దొరుకుతాయి. ఈ రంగులు లేతగా వుంటాయి. అంటే ప్రతి రంగులోనూ తెలుపు కలిసి వుంటుంది. అయినా ఈ రంగులు చిక్కగా వుంటాయి. ఈ రంగులు వాడిన బ్రష్‌లను ఆరకముందు నీటితో కడగాలి. ఆరితే నీటికి గూడా కరగవు. ఈ రంగులు సీలువేసిన డబ్బాలలో అమ్ముతారు. ఈ రంగులు ముదురుగా వుండాలంటే "స్టైనర్" అనే పేరుతో ప్లాస్టిక్ సీసాలలో ద్రవరూపంలో వున్న రంగులుంటాయి. వాటిని ఆయా రంగులలో కలుపుకోవాలి. బిల్డింగ్‌లకు వాడేది ఈ రంగులనే.

## నూనె రంగులు

**అవిశ** (Linseed Oil) గింజల నూనెను మీడియంగా వాడే రంగులనే ఆయిల్ కలర్స్ అంటారు. ఇవి చాలా శాశ్వతంగా వుంటాయి. గుడ్డమీద, చెక్కమీద, సిమెంటు గోడ మొదలగు వాటిమీద ఇవి చక్కగా పనికొస్తాయి. ఈ రంగులు ఎండిన తరువాత కూడా బీటలు ఇచ్చి రాలిపోవడం అరుదు.

1. **ఆయిల్ కలర్స్ (Oil Colours)** ఇవి రెడీగా దొరికే రంగులు. ట్యూబులలో నింపబడి అమ్మబడతాయి. చాలా రంగులను తయారుచేసి అమ్ముతుంటారు. కాస్త ఖర్చు యెక్కువ. ఆ ట్యూబులలోని రంగులను డైరెక్టుగా వాడెయ్యవచ్చు. పలుచని చేసుకోవాలంటేనే లిన్‌సీడ్ ఆయిల్‌ని కలుపుకొంటాం. ఈ రంగులను సాధారణంగా

గుడ్డమీద, చెక్కమీద, గోడమీద వేయవచ్చు. ఆ మూడింటిమీదా ముందు ప్రైమరు కోటింగు యిస్తారు. కోటింగు ఇచ్చిన గుడ్డను 'కేన్వాస్' అనే పేరుతో కూడా అమ్ముతారు. ఈ రంగులు వాడిన బ్రష్‌లను టర్పెంటైన్‌తో కడుక్కోవాలి. నీటితో కడిగితే వదలవు. ఇందుకోసం "లిన్‌సీడ్ ఆయిల్" పచ్చిదే సీసాలలో అమ్ముతారు. ఈ నూనె కలిపిన రంగు పూసింతరువాత రెండు మూడు రోజులకు గాని ఆరదు. పెద్ద పెద్ద కళాకారులు సాధారణంగా వాడేది వీటినే ఈ రంగులు ఎక్కువకాలం వుంటాయి.

2. **Double Boiled Oil Colours** మరిగించిన లిన్‌సీడ్ ఆయిల్‌తో వేసే పెయింటింగులు కూడా వున్నవి. ఈ విధానాన్ని సినిమా బ్యానర్ పెయింటింగులకు వాడుతారు. ఇందులో రంగు పొడులను ఉపయోగిస్తారు. ట్యూబురంగులను కాదు. గుడ్డమీద పెయింటింగు చేయడమే సాధారణం. ముందు గుడ్డమీద వుడకబెట్టిన సర్వీసు కోటింగును చాక్‌పొడరును కలిపి బ్రష్‌తో పూస్తారు. అది ఆరింతరువాత పెయింటింగు చేస్తారు. ఈ డబుల్ బాయిల్డు లిన్‌సీడ్ ఆయిల్ ఇనపకొట్లలో అమ్ముతారు. రంగు పౌడర్స్ కూడా. ఈ పెయింటు ఒక రోజులోనే ఆరిపోతుంది. ఈ మీడియం కాస్త చౌక. కానీ శాశ్వతంగా వుండదు. సినిమా బ్యానర్‌లకు ఎక్కువగా వాడబడుతుంది. ఈ రంగులు పూశాక కిరసనాయిల్‌తోగాని టర్పెంటైన్‌తోగాని బ్రష్‌లు కడుగుతారు.

**3. ఆయిల్ పేస్టల్స్ :** నూనెతో కలిపిన రంగు గుండలతో చేసిన కనికెలు. వీటిని కాగితంమీద, గుడ్డమీద బొమ్మలు వేయడానికి వాడవచ్చు. వీటిని నూనెతో కలపవలసిన అవసరం లేదు.

## వార్నిషు రంగులు

**1. ఎనామెల్ పెయింట్స్ :** రేకు, గాజుపలక సిమెంటుగోడ మొదలైన చదునైన వాటిమీద పెయింట్ చేయడానికి పనికివచ్చే రంగులు. సైన్‌బోర్డులను ఈ రంగులతోనే వేస్తారు. ఈ రంగులు చాలా అందంగా, నునుపుగా కనిపిస్తాయి. కాని సంవత్సరంవరకే, ఆ తరువాత మాసిపోతాయి. ఈ రంగులు 1, 1/2, 1/4 లీటర్ల డబ్బాలలో ఇనప కొట్లలో లభిస్తాయి. వీటిని వాడటానికి వెడల్పాండి బ్రష్‌లు కూడా ఇనపకొట్లలో దొరుకుతాయి. ఈ రంగులు వార్నీషుతో చేయబడ్డాయి. కనుక వీటిని పలుచన చెయ్యాలంటే వార్నీషును కలపాలి. మరీ పలుచన చెయ్యాలంటే తిన్నర్‌ను కలపాలి. ఈ రంగుల బ్రష్‌లు కిరోసిన్‌తో కడుగుతారు. ఈ రంగులకు ఖర్చు యెక్కువవుతుంది.

## ఇతర మీడియంలు

**1. ఫేబ్రిక్ పెయింట్స్ :** గుడ్డలమీద పువ్వులు, లతలు, డిజైన్‌లు వేసుకోవడానికి ఈ రకం రంగులు వచ్చాయి. దాని మీడియం కూడా అమ్ముతారు. ఈ రంగులను సేబుల్ హెయిర్ బ్రష్‌లతో వేయొచ్చు. ఈ బ్రష్‌లను నీటితో కడిగి వేయవచ్చు. ఈ రంగులు ఆరింతరువాత తడిచినా పోవు. బట్టలు ఉతికినా అవి పోవన్నమట.

**2. లక్క రంగులు :** లక్కను కరగబెడుతూ అందులో రంగులను కలుపుతారు. వాటినే లక్క రంగులంటారు. ఈ రంగులను కరగబెట్టి చెక్క బొమ్మలకు వేస్తారు. ఇవి ఎనామెల్ పెయింట్లవలె మెరుస్తాయి.

**3. మైనం రంగులు :** మైనంతో కలిపిన రంగుల కనికెలను Wax Crayons (వేక్స్ క్రేయాన్స్) అని అమ్ముతారు. ఇవి కాగితంమీద బొమ్మలు గీయడానికి బాగుంటాయి. తడిచినా పాడయిపోవు.

# క్రేయాన్స్, పేస్టల్స్

# CRAYONS & PASTELS

## వేక్స్ క్రేయాన్స్ :-

వీటిని వేక్స్ క్రేయాన్స్ అంటారు. అంటే మైనపు బలపాలు, వివిధ రంగులలో వుంటాయి. సాధారణంగా ఒక పెట్టెలో డజను రంగులుంటాయి. ఈ పెట్టె సిగరెట్ పెట్టెకంటె కాస్త వెడల్పుగా వుంటుంది. ఇవి చాలా చవుక. వీటిని వివిధ కంపెనీలవారు చేస్తున్నారు. కొన్ని కంపెనీల వారివి చాలా బాగా పనిచేస్తాయి. కొన్ని కంపెనీలవి ప్రకాశవంతమైన రంగులు వుండకుండా మడ్డిగా వుండి బాగోవు. వీటిని తెల్లని మామూలు డ్రాయింగ్ పేపరులమీద గీసి పెయింటింగ్‌లను తయారు చేసుకొంటాము. వాస్తవానికి ఈ రంగు చిత్రాలను పెయింటింగ్‌లు అనకూడదు. డ్రాయింగ్‌లు అనాలి. ఎందుకంటే పెన్సిళ్లవలెనే పేపరు మీద రుద్దుతూ చిత్రిస్తాంగాని బ్రష్‌ల వాడంకగాని, నీరు లేక నూనెలాంటి మీడియంల వాడకంగాని వుండదు కదా.



డ్రాయింగ్ పేపర్‌లతో చేయబడిన ఒక స్కెచ్‌బుక్‌ను చేతబట్టుకొని, ఒక వేక్స్‌క్రేయన్‌ల పెట్టెను జేబులో పెట్టుకొని ఎక్కడికి వెళ్లయినా సరే లాండ్ స్కేపుల స్కెచ్‌లను చిత్రించుకోవచ్చు. ఇంకేమీ పనిముట్లు, బరువులూ, తీసుకెళ్ళేపని లేదు. కనుక ఈ మీడియం ఆలా సులువైనది. సౌకర్యమైనది.

ఈ విధానాన్ని నేర్చుకోడానికి పెద్ద ట్రైనింగ్ యేమీ అవసరం లేదు. పెన్సిల్‌లను గీసినట్లూ, రుద్దినట్లూ వాడి ఈ బొమ్మలు చిత్రించవచ్చు. పెన్సిల్ ముల్లుకంటే ఈ క్రేయన్‌ల మొనలు మందంగా వుంటాయి. గీస్తే మందమయిన గీత పడుతుంది. అదే పెన్సిల్‌కి దీనికీ తేడా.

కలర్ పెన్సిల్‌లకంటే వేక్స్‌క్రేయన్‌ల గీతలు చాలా ప్రకాశవంతంగా వుంటాయి. ముచ్చటగా వుంటాయి. కనుక వీటిని పిల్లలు బాగా అభిమానిస్తారు. ఇవి చాలా చవుకగనుక పిల్లలకు కొనియిస్తే మంచిది. వాటితో బొమ్మలు గీసుకొని వారు యెంతో ఆనందిస్తారు.

వెంటనే ఒక పెట్టి వేక్స్‌క్రేయన్స్ కాస్త స్టాండర్డుగా వుండే కంపెనీది కొనుక్కోండి. మీరూ మంచి మంచి బొమ్మలు గీయగలుగుతారు.

డ్రాయింగ్ పేపరుమీద ముందుగా లైట్ (HB) డ్రాయింగ్ పెన్సిల్‌తో స్కెచ్ వేసుకోండి. ఆ తరువాత ఆ స్కెచ్‌లో ఏయే రంగులు నింపాలో వూహించుకోండి. ఆ తరువాత ఆయా రంగుల క్రేయాన్‌లతో వాటిని నింపండి. నింపేటప్పుడు క్రేయాన్‌గీత మందంగా పడవచ్చు. అదే మంచిది.తొందరగానూ రంగుతో నింపవచ్చు. ప్రకాశవంతంగా చిక్కగా రంగు అంటుతుంది కూడా. ఒకవేళ చిత్రంలో సన్ననిలైనులు (ఔట్ లైనులులాగా) వేయాలనుకోండి. క్రేయాన్‌ని కాస్త మొన వచ్చేట్లు చెక్కుకోవాలి. అప్పుడే సన్ననిలైనులు గీయగలుగుతాం. ఎక్కువ యేరియాను నింపవలసిన దగ్గర సూది మొన వైపు గీయకుండా మందం మొనవైపు గీయడమే మంచిది. మొత్తం చిత్రం అంతటా ఆయా రంగుల క్రేయాన్‌లతో నింపేటప్పుడు లూజుగా, దూరదూరంగా గీయకూడదు. పేపరు తెలుపు కనబడకుండా చిక్కగా, గట్టిగా రుద్దాలి. గట్టిగా అంటే క్రేయాన్ ముక్కలయిపోయినంత గట్టిగా రుద్దకూడదు.

ఈ రంగులచిత్రంలో రెండు రంగులు కలిపి మరొకరంగు తేవడం కాస్త కష్టం. అయినా చేయవచ్చు పసుపు, ఎరుపు క్రేయాన్‌లుగీసి ఆరెంజ్ కలర్‌ను సాధించాలనుకోండి. ఆ క్రేయాన్ని కాసేపు, ఈ క్రేయాన్ని కాసేపు లైట్‌గా గీస్తూ, మరలదాన్ని, మరలదీన్ని గీస్తూ ఆయేరియాను నింపాలి. ఆఖరికి ఆరెంజ్‌కలర్ వస్తుంది. ఇది కాస్త ప్రాక్టీస్‌లో తెలుస్తుంది. ఏదన్నా ఒక రంగు క్రేయాన్‌తో గట్టిగా గీసిన తరువాత దానిపై మరో రంగు పడదు. ఆ రంగు చెరగదు కూడా. గనుక జాగ్రత్తగా అవసరమైన చోటనే రంగులు వేయాలి.



ఈ రంగుల వెక్స్‌క్రేయన్‌లతో లాండ్ స్కేపులనూ, స్టిల్ లైఫ్‌లనూ, పోర్ట్రయిట్‌లనూ చిత్రించవచ్చు. మరీ డీ టైల్సువున్న చిత్రాలనూ, సన్నని రేఖా చిత్రాలను గీయడం చాలా కష్టం. అలాంటివాటికి గాకుండా డీటైల్సు, రేఖలు తక్కువ వుండి ఉత్తరంగుల సముదాయాలుగా కనబడే వాటిని చిత్రించడమే మంచిది. అందులో ప్రకాశవంతమయిన వాటిని చిత్రించడానికి ఈ మడీయం భలే పనికొస్తుంది. రంగురంగుల ఫలములు, పుష్పములు గీయడం చాలా తేలిక. బాగుంటాయి కూడా.

ఈ రంగుల క్రేయాన్‌లకు కాస్త గరుకుగావుండే మందమయిన కాగితం మేదయినా పనికివస్తుంది. తెల్లని డ్రాయింగ్ పేపరులే బాగుంటాయి. మరేవయినా లైట్ కలర్స్‌లో వుండే గరుకుగావుండే పేకింగ్ పేపరుఏదయినా దొరికినా వాడి చూడండి.

ఈ రంగుల చిత్రము మీద వార్నిష్‌గాని, ఫిగ్సటిప్‌గాని పూయనవసరంలేదు. ఈ రంగులు రాలిపోవు పేపరును అంటి పెట్టుకొనే వుంటాయి.

## పేస్టెల్స్ :

వీటిని ఆయిల్ పేస్టెల్స్ అని కూడా అంటారు. ఇవి సన్నని చాక్‌పీసులవలె రంగులలో వుంటాయి. ఇదీ సులువైన మీడియమే. ఆహ్లాదకరమైన రంగులు. పేస్టెల్ చిత్రాలు చాలాకాలం ఉంటాయి. వాటి తేజస్సుకూడా తగ్గదు. కమర్షియల్ ఆర్ట్‌లో కూడా దీని ఉపయోగం వుంటుంది.

పేస్టెల్సు వివిధ రంగులలో వుంటాయి. 12 రంగులతోను, 24 రంగులతోనూ 48 రంగులతోనూ పెట్టెలు వుంటాయి. ఇవి వాడటానికి గరుకుగా వుండే డ్రాయింగ్ పేపరు పనికివస్తుంది. పేస్టెల్ డ్రాయింగ్ కోసం ప్రత్యేకంగా పేపర్లుంటాయి. అవి తెల్లగాగానీ, మరే లైట్ కలర్స్‌గానీ వుండవచ్చు. మందంగా, లైట్ కలర్స్‌తో, గరుకుగా వుండే పేకింగ్ పేపర్లను కూడా వాడవచ్చు. వివిధ కాగితాలమీద వాడి చూడండి. బ్లాటింగ్ పేపరు, ఎమిరీపేపరు కూడా వాడవచ్చు.

ఈ పేస్టెల్సు క్రేయాన్స్‌లా గాకుండా పొడిపొడిగా వుంటాయి. చిత్రించిన బొమ్మనుండి పొడి రాలిపోతుంటుంది కూడా. గనుకనే ఆపొడి రాలిపోకుండా చిత్రం పూర్తయిన తరువాత ఫిగ్సటివ్ (Fixative) అనేదానిని స్ప్రే చేస్తారు. ఫిగ్సటివ్‌సీసాలో స్ప్రేయర్‌యొక్క ఒక గొట్టాన్ని పెట్టి మరో గొట్టంను నోటిలో పెట్టుకుని పూదితే అది చిమ్ముతుంది. బొమ్మకు అడుగుదూరంలో నుండి అలా చిమ్ముతూ చిత్రంమీద స్ప్రేచేస్తే ఆ చిత్రం రాలి పాడయిపోదు. ఆ చిత్రం ఉపరితలంమీద చిక్కని పారదర్శకమైన పదార్థం పేరుకొని పోతుందన్నమాట. ఫిగ్సటివ్ దొరక్కపోతే పిక్చర్ వార్నిష్ అనబడేది అయినా వాడవచ్చు. దానిగురించి ఆయిల్ పెయింటింగ్ పాఠంలో తెలుసుకుంటారు.

పేస్టెల్సు కూడా మందంగా వుంటాయిగనుక మందపు గీతలే పడతాయి. పేస్టెల్ అంచును పాయింటుగా చెక్కుకొని సన్నని గీతలనూ గీయవచ్చు.

పేస్టెల్ చిత్రానికి ముందు స్కెచ్‌ను చార్‌కోల్‌తో చిత్రించుకుంటే మంచిది. చార్‌కోలే లేకపోతే HB డ్రాయింగ్ పెన్సిల్‌ని వాడవచ్చు. చార్‌కోల్ అంటే సన్నని బొగ్గుపుల్ల. ఈ బొగ్గుపెన్సిల్లు కూడా బజారులో దొరుకుతాయి. చార్‌కోల్ కూడా పేస్టెల్స్‌లాగా పొడిగా వుంటుంది కాబట్టి దానిని వాడటమే ఉత్తమం.

తప్పుగా పడిన రంగు గీతలను చెరపడానికి హాగ్ హెయిర్ ఫ్లాట్‌బ్రష్ వుంటే మంచిది. ఆ బ్రష్‌తో దులిపి వెయ్యవచ్చు.

మూడురకాల పేస్టెల్స్‌ను ఉపయోగించి చిత్రిస్తారు.

ఒకటి : గీత ప్రక్కన గీత గీసుకుంటూ నింపడం. అంటే స్ట్రోక్స్ స్ట్రోక్స్‌గా రాస్తూ పోవడం.

రెండు : కాగితంమీద ఖాళీ కనబడకుండా పేస్టెల్‌ను రుద్దటం.

మూడు : లైట్‌గా పేస్టల్‌ను రుద్ది దానిని మరల వ్రేలుతోగాని, గుడ్డముక్కతోగాని రుద్ది నింపడం.

మొదటి పద్ధతి బొమ్మలే చాలా ఆకర్షణీయంగా టెక్చర్‌ను కలిగి చూడచక్కగా వుంటాయి.

రెండు రకాల పేస్టెల్స్‌ను ఒక దాని తరువాత ఒకటి మర మరల రుద్దుతూ కాంబినేషన్ కలర్‌ను సృష్టించవచ్చు.

ఈ మీడియంలో ముందు నీడల నల్లని భాగాలను, తరువాత వస్తువుల రంగులను, ఆఖరును హైలైట్ మెరుపులను చిత్రిస్తారు. హైలైట్ మెరుపులకోసం తెలుపు పేస్టెల్ స్ట్రోక్‌లను లేదా పసుపు పేస్టెల్ స్ట్రోక్‌లను గట్టిగా ఒకటి రెండు గీతలతోనే వెయ్యాలి.

పేస్టెల్స్ మీడియంలో పూవులు వేయడం సులువుగా వుంటుంది. ఫలములు కూడా అందంగా వేయవచ్చు. స్టిల్ లైఫ్‌ల తరువాత, లాండ్ స్కేపులను చిత్రించడం అలవర్చుకోవచ్చు. మనుషుల బొమ్మలను (Portraites) చిత్రించడం కష్టం. అయినా నేర్చుకోవచ్చు. సాధించితే చాలా ముచ్చటగా వుంటాయి.

పేస్టెల్సు కూడా క్రేయాన్స్‌వలె గీసేవే గాబట్టి దీనిని పేస్టెల్ "డ్రాయింగ్" అని అంటారు. పెయింటింగ్ అనరు.

క్రేయాన్స్‌వలె పేపరును పేస్టెల్ డస్టు గట్టిగా అంటుకోదు. గనుక పేస్టెల్స్ పోర్టబుల్ కాదు. ఎక్కడికైనా జేబులో పట్టుకెళ్లి చిత్రించుకోడానికి పనికిరాదు. ఒకవేళ అలా పేస్టెల్సును జేబులో తీసుకెళ్లి ఏదన్నా ఒక ప్రకృతి దృశ్యాన్ని చిత్రించాం అనుకోండి వెంటనే ఆ బొమ్మను స్ప్రే చేస్తే ఫరవాలేదు. అది ఇక రాలిపోదు. క్రేయాన్స్ కయితే ఈ స్ప్రే అవసరం లేదు.



పేస్టెల్సు మరీ సులువుగా ఇరిగి ముక్కలయి పోతుంటాయి. జాగ్రత్తగా వాడాలి. పెన్సిల్‌ని పట్టుకున్నట్టు పట్టుకొని వ్రాయకూడదు. చూపుడువ్రేలు, బొటన వ్రేలు మధ్యలో పేస్టెల్‌ను పట్టుకొని గీయవలసి ఉంటుంది.

పేస్టెల్స్ గీతలను మందంగా, ఒత్తుగా రంగుపడేటట్టు గీతమీద గీత గీసినచో చిత్రాలు నిండుగా అందంగా వుంటాయి.

# వాటర్ కలర్స్

# WATER COLOURS

నీటితో కలిపి వేసే రంగులను వాటర్ కలర్స్ (నీటి రంగులు) అంటారు. ఇవి చవకగా లభిస్తాయి. గనుక యెక్కువగా వాడుకలో ఉన్నాయి. ఇవి అనేక దేశాలలో అనేక శతాబ్దాలనుండి వాడబడుతున్నాయి. ఈ మీడియంతో అన్ని రకాల చిత్రాలనూ - లాండ్ స్కేప్‌లు, స్టిల్‌లైఫ్‌లు, పోర్ట్రయిట్‌లు, ఇలస్ట్రేషన్‌లు మొదలైనవి - వేయవచ్చు. అన్నిటికంటే బాగా లాండ్ స్కేప్‌లకు పనికివస్తుంది. ఈ మీడియంతో చిత్రాలు వేయడంలో జాప్యం కూడా వుండదు. ఈ రంగులు ఎప్పటికప్పుడు ఆరిపోతాయి గనుక ఏ రోజు చిత్రం ఆరోజే పూర్తి అవుతుంది. ఆయిల్ పెయింటింగ్‌వలె రోజుల తరబడి ఆలశ్యం జరగదు.

వాటర్ కలర్స్‌కు కావలసిన పరికరాలేమిటో చూద్దాం.

## రంగులు :

వాటర్ కలర్స్ అనే పేరుతో అన్నిటౌన్‌లలోనూ దొరుకుతాయి. చవకగానే వుంటాయి. ప్రతి పెట్టెలోనూ పన్నెండు రంగులు వుంటాయి. ఈ రంగులు బిళ్లలుగానూ, ట్యూబులుగానూ రెండు రకాలుగానూ వుంటాయి. ఏదయినా పనికి వస్తుంది. ట్యూబులయితేనే ఎక్కువ ఉపయోగం. రెండు లేక మూడు రంగులు కలిపేటప్పుడు ఆ ట్యూబులనుండి కావలసినంత పిండుకొని వాడవచ్చు. రంగు పౌడర్లు కూడా వుంటాయి. కానీ అవి గోడ వ్రాతలకు, గుడ్డమీద బ్యానర్లు వ్రాయడానికి పనికివస్తాయి. కాగితాలపై వేసే చిత్రాలకు బాగుండవు.

## కాగితాలు :

నీటి రంగులను సాధారణంగా తెల్లని కాగితాలమీదనే ఉపయోగిస్తాం. సాధారణ డ్రాయింగ్ పేపర్లు, హేండ్‌మేడ్ పేపర్లు, "వాట్‌మన్ పేపర్లు" మొదలైన అనేక రకాల కాగితాలను వాడవచ్చు. ప్రత్యేకంగా నీటి రంగులకోసమే చేసి అమ్మబడేవి వాట్‌మన్ పేపర్లు. అవి ఖరీదు యెక్కువ. మామూలు డ్రాయింగ్ పేపరులు నీటిరంగులు వాడేటప్పుడు తడిసి ముడతలు పడవచ్చు. అందుకని వాటిని ఒకసారి తడిపి ఆరబెట్టి వాడవచ్చు

## కుంచెలు :

మెత్తని వెంట్రుకలు గల కుంచెలే నీటి రంగులకు పనికివస్తాయి. బరువైన వెంట్రుకలు పనిచెయ్యవు

సేబుల్ హెయిర్, స్క్విరల్ (ఉడుత) హెయిర్, కేమెల్ (ఒంటె) హెయిర్ బ్రష్‌లు పనికొస్తాయి. బ్రష్‌లలో కొన్ని రౌండ్‌వి, కొన్ని ఫ్లాట్‌వి వుంటాయి. వివిధ సైజులలో అవికొన్ని, ఇవికొన్ని వుండాలి. సన్నని ఔట్ లైనులకు 0 నెంబరు వుండే పాయింట్ బ్రష్‌ను కూడా వుంచుకోవాలి. బ్రష్‌ల సైజులు నెంబర్లు బట్టి వుంటాయి. 2, 4, 6, 8, 10 మొదలైన నంబర్లను కొనుక్కుంటే చాలు. ఎక్కువ బ్రష్‌లను కొనుక్కోగలిగితే మంచిదే. బ్రష్‌లను పెయింటింగ్ అయిపోగానే బాగా సబ్బునీళ్లు, లేదా సర్ఫ్‌నీళ్లలో కడిగి తరువాత మంచి నీళ్లలో జాడించి ఆరవేయాలి. ఆరవేయడానికి కుంచెలను వెంట్రుకలు పైకి వుండేట్లు డబ్బాలో నిలబెట్టాలి. వాటర్ కలర్స్‌కు రౌండ్ బ్రష్‌లనే యెక్కువగా వాడతారు. ఎక్కువ ఏరియాలను ఒకే రంగుతో నింపేటప్పుడు ఫ్లాట్ బ్రష్‌ను వాడుతారు.

## పేలెట్‌లు :

రంగులు కలుపుకోడానికి లోతుగా వుడే పింగాణి డిష్‌లు లేక ప్లాస్టిక్ పేలెట్‌లు వుంటాయి. ఆ పేలెట్‌లో లోతయిన గుంటలుంటాయి. వాటిలో రంగును కాస్త పిండుకొని తగినంత నీరును కలుపుకుంటాం. పెయింట్ చేయవలసిన ఏరియాను బట్టి తగినంత నీరు కలిపి రంగును రెడీ చేసుకుంటాము.

రంగులు కలుపుకోడానికి తగినంత మంచినీరును దగ్గరుంచుకోవాలి. ఎక్కువయిన రంగును బ్రష్‌నుండి తుడిచి వెయ్యడానికి కడిగిన బ్రష్‌లను తుడవడానికి ఉతికిన గుడ్డ ముక్క వుంచుకోవాలి. బాగా మాసినవి పనికి రావు. బ్రష్‌లు కడుక్కోడానికి సర్ఫ్‌నీళ్లు కూడా కావాలి.

డ్రాయింగ్ పేపరు పెట్టుకోడానికి డ్రాయింగ్ బోర్డ్ లేక క్లిప్ అట్ట వున్నాయి కదూ.



# నీటి రంగుల గుణాలు - సూచనలు:

ఈ రంగులు పలుచగా వుంటాయి. అంటే పారదర్శకం (Transparent) గా వుంటాయి. ఆ రంగులను లైట్‌గా వేయాలంటే తెలుపు కలపనవసరం లేకుండా నీరు కలుపుకొని వేయొచ్చు. డ్రాయింగ్ పేపరుయొక్క తెలుపు కనిపిస్తూంటుంది. సాధారణంగా రంగులో నీరు యెక్కువగా కలుపుతాము. చిక్కని రంగు రావాలంటే నీరు తక్కువ కలపాలి.

ఈ రంగులు త్వరత్వరగా ఆరిపోతుంటాయి. కనుక ఈ మీడియంతో పెయింట్ చేసేటప్పుడు చాలా వేగంగా చిత్రించాలి. రంగు ఆరింతరువాత ఇంక కలవదు. కరగదు. మరో రంగుతో కలపడం వీలుపడదు. అదే రంగు ప్రక్కప్రక్కన వేసినా కలవదు.

రంగు ఆరిన తరువాత కలవదు గనుక మొత్తం ఎంతరంగు కావాలో దానిని ముందే డిష్‌లో కలిపి వుంచుకోవాలి. రంగు చిక్కగా వుండాలంటే నీరు తక్కువ కలపాలి. రంగు పలుచనవ్వాలంటే నీరు ఎక్కువ కలపాలి.

పెయింట్ చేసేటప్పుడు మన అరచెయ్యికు పెయింటింగ్ యొక్క తడి తగలకుండా వుండేందుకని సాధారణంగా రంగు వేయడం పేపరుమీద పైనుండి మొదలుపెట్టి ఆఖరకు క్రిందికివచ్చి పూర్తి చేస్తాం. ఆయా రంగులు పూసేటప్పుడు ఎడమనుండి కుడికి బ్రష్‌ని నడుపుతూ రంగు పూస్తాం.

అంతేగాక నీటి రంగులు వాడేటప్పుడు లైట్ కలర్స్‌ను ముందు వాడుతూ ఆఖరుకు చిక్కని రంగులను (డార్క్ కలర్స్‌ను) వాడతాం. ఎందుకంటే పలుచని రంగులను కావాలంటే ఇంకా చిక్కన చేసుకోచ్చుగాని ముందే చిక్కని రంగు వేస్తే దాన్ని పలుచన చేయవలసివస్తే అది అసాధ్యం అవుతుంది. నీరు వేసి కుంచెతో రుద్దితే కాగితం చిరుగుతుంది.

పెయింట్ చేసేటప్పుడు కుంచె అంచుమాత్రమే పేపరుమీద నడవాలి గాని కుంచె మొదలు పేపరుకు రాసుకోగూడదు. అవసరం అయితే కుంచె సగం వరకూ ఆనవచ్చు. మొదలు రాసుకుంటే కుంచెయొక్క వెంట్రుకలు వూడిపోయి కుంచె పాడవుతుంది. బొమ్మ పాడవుతుంది.

## విధానం :

నీటి రంగులను మూడు రకాలుగా వాడుతారు.

1. నీరు ఎక్కువగా కలుపుకుని వేసే విధానం.
2. నీరు తక్కువతో అంటే చిక్కని రంగులతో వేసే విధానం.
3. కొన్నిచోట్ల పలుచగానూ, కొన్నిచోట్ల చిక్కగానూ వేసే విధానం.

## కలర్ వాష్ :

డ్రాయింగ్ పేపరుపై కొంత ఏరియాను తీసుకొని దానినిండా ఒకే టోన్‌లో రంగును పూయాలనుకోండి.

ఇందుకోసం ఆ ఏరియాకు సరిపడే రంగును ముందే నీటితో కలుపుకోవాలి. అది ఇంచుమించు రంగు నీరులా వుంటుంది. ఫాట్ బ్రష్‌ని తీసుకొని (పెద్ద రౌండ్ బ్రష్ అయినా వాడవచ్చు). దానిని రంగులోముంచి ఆ కుంచెనిండా రంగును తీసుకొని కాగితంపై ఎడమనుండి కుడికి పెయింట్ చేయాలి. ఒకటి రెండు సెంటీమీటర్ల వెడల్పు చారలులాగా ఒకదాన్ని ఆనుకొని మరొకటి పూస్తూ వేయాలి. మొదటి వరుస ఆరిపోకముందే రెండవ వరుసను ఎడమనుండి కుడివైపుకు పూయాలి. ఈ విధంగా ఈ మొత్తం ఏరియాని ఒకే రంగుతో నింపాలి. ఆకాశం లాంటి వాటికి ఈ విధముగా కలర్ వాష్ ఇస్తాం. నీలం రంగుతో ఇలా వేసి చూడండి. అంతే ఒకే టోన్‌లో (అంటే ఒకే షేడ్‌లో) వుండేట్లు వేయగలగాలి. మళ్లీ మళ్లీ సాధన చెయ్యండి.

## కలర్ గ్రేడేషన్ :

ఏ కలర్ అయినా ఒకే షేడ్‌లో (టోన్‌లో) కాకుండా ఒక వైపు లైటుగా వుంది. మరొకవైపు డార్కుగానో లేదా ఇతర రంగు యొక్క కలయికతోనో పూయడాన్ని కలర్ గ్రేడేషన్ అంటాం. ప్రకృతిలో ఏ వస్తువూ ఒకే కలర్ యొక్క ఒకే టోన్‌లో వుండదనే విషయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే మీరూ గ్రహించగలరు. ఈ కలర్ గ్రేడేషన్ (లేదా బ్లెండింగ్)ను చేసి చూద్దాం. పేలెట్‌లోని రెండు గుంటలలోనూ రెండు రంగులు కలిపి వుంచాలి. ఒకదాంట్లో పసుపు, ఒకదాంట్లో ఎరుపులను కలిపి వుంచుకోండి. తగినంత నీరును కలిపి రెడీ చేయండి. మొదట పెద్ద రౌండ్ బ్రష్‌తో ఎరుపును నిండా తీసుకొని పై విధంగా పూయడం మొదలు పెట్టాలి. కొన్ని వరుసలు పూసి సగం వరకూ వస్తాం. అక్కడ నుండి ఆ బ్రష్‌నే పసుపు రంగులో ముంచి నిండా తీసుకొని ఆ ఎరుపు మీదనుండే మొదలుపెట్టి పూయడం ప్రారంభిస్తాం. ఆ ఎరుపు ఆరకుండా వుండివుంటే పసుపు, ఎరుపు చక్కగా కలుస్తాయి. కలిసినచోట ఆరంజ్‌రంగు మిశ్రమం కనిపిస్తుంది. తరువాత క్రమంగా పసుపురంగు వస్తుంది. అంటే ఎరుపు నుండి ఆరెంజ్, ఆరెంజ్‌నుండి పసుపుకూ మారుతుంది. ఈ పద్ధతిని అనేక సందర్భాలలో ఉపయోగించవచ్చు. ఆకులో ముదురు ఆకుపచ్చనుండి లేత పసుపు వరకూ వేయవచ్చు. సాయంత్రపు ఆకాశంలో నీలంనుండి ఎరుపు వరకూ చూపించొచ్చు.

## తడి రంగులపై మరో రంగును పూయడం :

కొంత ఏరియాను ఒక పలుచని రంగుతో వాష్ చెయ్యండి లేదా తడపండి. అది ఇంకా పూర్తిగా ఆరకముందే మరో రంగుతో దానిపై మరక వెయ్యండి. ఆ మరకయొక్క అంచు పాతరంగుతో కలుస్తూ కొంత చెదురుతూ కలుస్తుంది. ఈ రకంగా నీలపు ఆకాశంలో తెల్లని మేఘాలనూ, చీకటి ఆకాశంలో తెల్లని చంద్రబింబన్ని, ఉదయం కనబడే పసుపురంగు ఆకాశంలో ఎర్రని సూర్యోదయాన్ని చిత్రించ గలుగుతాం.

## చైనా పద్ధతి కలర్ పెయింటింగ్ :

పేలట్‌లో రెంగు గుంటలలో రెండు రంగులను కలుపుకోండి. ఒకటి పలుచని గ్రీన్, రెండోది చిక్కటి నీలం. అంటే గ్రీన్ ఎక్కువ నీటితోనూ, నీలం తక్కువ నీటితోనూ కలిసివుంటాయి. ఇప్పుడొక నాలుగవ నెంబరు

రౌండ్ బ్రష్ తీసుకోండి. దానిని పలుచని గ్రీన్‌లో పూర్తిగా ముంచి తియ్యండి. కుంచెనుండి అదనంగావున్న రంగును కారిపోనివ్వండి. అప్పుడు మళ్లీ ఆ కుంచె పాయింటు (కొన)ను మాత్రం చిక్కని నీలంలో ముంచి తీయండి. ఇప్పుడు ఆ బ్రష్‌తో కాగితంపై మందపు గీతలు, మరకలు, పెద్ద పెద్ద చుక్కలు వెయ్యండి. అవి రెండు రంగుల కలయికతో వింతశోభను ప్రదర్శిస్తాయి. ఈ విధంగా ఆకులను ఒకటి రెండు స్ట్రోక్‌లతో వేయవచ్చు. భలే బాగావస్తాయి. వెలుగు నీడలతో కూడిన ఆకుల్లాగా రూపొందుతుంది. ఇలాగే పలుచని ఆరంజ్‌ను చిక్కని ఎరుపును కలిసి పూస్తే మంచి పూరేఖలు తయారవుతాయి.

## ఔట్‌లైన్‌లు :

నీటి రంగుల పెయింటింగ్‌లలో కొందరు ఔట్‌లైన్‌లను కూడా వాడతారు. కొందరు ఔట్‌లైలను ప్రత్యేకంగా వెయ్యరు. ఔట్‌లైన్‌లను వేసేవారిలో కొందరు ముందు ఔట్‌లైన్‌లను గీసి తరువాత రంగులు పూస్తారు. మరికొందరు ముందు రంగులను పూసి ఆరనిచ్చి ఆ తరువాత ఔట్‌లైన్‌లు వేస్తారు. ఔట్‌లైనులూ కలర్ వాష్‌లూ కలిసి మెలిసి కనిపిస్తే అదొక అందం. భారతీయ, చైనా సాంప్రదాయక కళలలో ఈ ఔట్‌లైనులుంటాయి. అజంతా చిత్రాలు ఎప్పుడైనా చూశారా?

## ఇండియన్ వాష్ టెక్నిక్ :

పూర్తిగా కలర్స్ వేసిన చిత్రాన్ని నీటిలో ముంచి కడిగి వేస్తారు. కొంతరంగు పోతుంది. కొంతరంగు వుంటుంది. దానిని ఆరబెట్టి మరల రంగులు వేస్తారు. మరల నీళ్లలో ముంచుతారు. ఆరింతరువాత మరల రంగులువేసి సన్నని ఔట్‌లైనులు వేస్తారు. ఇది మన సాంప్రదాయక విధానం.ఇలా చిత్రిస్తే రంగులు నునుపుగా అందంగా వుంటాయి. కానీ ప్రకాశవంతమయిన మెరుపులు మిగలవు. మన రాజమండ్రి చిత్రకారులు యిలావేసేవారు. ఇది శాంతినికేత్ వరవడి అయివుండొచ్చు.

## రంగుల చక్రం



ప్రాథమిక వర్ణాలు



ద్వితీయ వర్ణాలు



వ్యతిరేక రంగులు





వరుసక్రమ రంగులు






వేక్స్ క్రేయాన్స్‌తో వేయబడిన చిత్రం



# వాటర్ కలర్ టెక్నిక్స్



ఒకే రంగుతో కలర్ వాష్



తడిరంగు మీద రంగు




రంగుపెట్టి తడిబ్రష్‌తో వాష్ చేయడం.



రెండు రంగుల కలర్ బ్లెండింగ్
(పసుపు + నీలం)



చైనా పద్ధతి రంగువేయడం.
(బ్రష్‌తో ఒకేసారి రెండు రంగులు)

# పోస్టరు కలర్స్

# POSTER COLOURS

పోస్టరు కలర్స్ కూడా నీటితో కలిపి వాడే రంగులే. కానీ యివి వాటర్ కలర్స్‌వలె పలుచగా చేయకుండా చిక్కగా వాడాలి. పారదర్శకంగా (Transparent) వుండకుండా మందం (Opaque) గా వుండాలి. కనుక వీటిని Body Colours అని కూడా అంటారు. టెంపరా (Tempera) కలర్స్ అనబడేవి కూడా ఇలాంటివే.

ఈ రంగులు చిక్కగా వుండి ఒకే టోన్‌లో వుండి ఫ్లాట్‌గా కనిపిస్తాయి. వాటర్ కలర్స్‌వలె నీరు ఎక్కువ కలిపి కలర్ వాష్ చేయడానికి ఈ రంగులు పనికిరావు. ఒకవేళ అలా వాడితే కాగితం మీద నలకలు కనిపిస్తూ చూడటానికి బాగుండదు.




ఈ రంగులు సీసాలలో లభ్యం అవుతాయి. వివిధ పేర్లతో ఇరవై ముప్పై రంగులు వుంటాయి. కానీ మనకు ప్రాథమిక వర్ణాలు (ఎరుపు, పసుపు, నీలం) మూడు, తెలుపు ఒకటి, నలుపు ఒకటి మొత్తం అయిదు రంగులుంటే చాలు. వాటితో ఎన్ని రంగులనైనా చేసుకోవచ్చు. సాధారణంగా ఈ రంగులు విడివిడిగానే వాడతాం. వాటర్ కలర్స్‌వలె ఎక్కువ నీరు కలపకుండా తక్కువ నీటితో చిక్కగా ఈ రంగులను పూస్తాం..బ్రష్ నడపటానికి

వీలు పడనంత చిక్కగానూ వుండకూడదు. రంగు పలచబడే అంత ఎక్కువ నీరూ పనికిరాదు. ఎంత చిక్కగా వాడాలో అనుభవంలో మీకే తెలుస్తుంది. కొనగలిగే వారు ఎక్కువ రంగులే కొనుక్కోవచ్చు.

ఈ రంగులు పూయడానికి సేబుల్ హెయిర్ గాని, స్క్విరల్ హెయిర్ గాని, కేమెల్ హెయిర్ గాని బ్రష్‌లను వాడవచ్చు వాటిలో రౌండ్‌వి, ఫ్లాట్‌వి పనికివస్తాయి.

ఈ రంగులను ఏ కాగితం మీదయినావే యవచ్చు. రంగు కాగితాలు మీద కూడా వేయొచ్చు. వాటర్ కలర్స్ అయితే తెల్ల కాగితాల మీదనే వేస్తాం. పోస్టర్ కలర్ పేపరు వివిధ రంగులలో కూడా లభిస్తాయి. ఈ రంగులు చిక్కనివి గనుక ఆ రంగు కాగితాల రంగును కప్పివేయ గలుగుతాయి. ఆ కాగితం రంగు కనబడవలసిన చోట పోస్టర్ రంగును పూయకుండా వదిలివేస్తాం. అంటే చిత్రం వెనుక బ్యాక్ గ్రౌండ్ కలర్ గా ఆ పేపరు యొక్క రంగే వుంటుందన్న మాట. ఇంకా యీ రంగులకు కార్డ్ బోర్డ్‌లు, డ్రాయింగ్ పేపర్లు, ఆర్ట్ బోర్డులు మొదలయినవన్నీ పనికి వస్తాయి.

ఆయిల్ కలర్‌లలో లాగానే పోస్టర్ కలర్‌లు కూడా ఒక రంగు ఆరిన తరువాత దానిమీద మరొక రంగువేస్తే అడుగు రంగు కప్పాడి పొంతుంది. ఎక్కువ తడిస్తే పాత రంగు కరిగిపోయి కొత్తగా వేస్తున్న రంగుతో కలసి మరో రంగు తయారయ్యే ప్రమాదం వుంటుంది. అయిల్ కలర్‌లలో వలెనే తెల్ల రంగుతో కలుపుకుంటే ప్రతి రంగూ లైట్ కలర్‌గా తయారవుతుంది. వాటర్ కలర్స్‌లో అయితే నీటిని కలిపితే చాలు లేతరంగు తయారవుతుంది. ఆయిల్ కలర్స్ త్వరగా ఆరవు. పోస్టరు కలర్స్ త్వరత్వరగా ఆరిపోతూవుంటాయి. కనుక వేగంగా చిత్రించవలసి వుంటుంది.

పోస్టర్ కలర్ పేపర్లు బిగించడానికి డ్రాయింగ్ బోర్డ్ వుంటే మంచిది. కనీసం రైటింగ్ పేడ్ వున్నా దానికి పిన్‌లతో బిగించి వాడవచ్చు. పోస్టర్ కలర్ పేపర్ల మీద పెన్సిల్ స్కెచ్ లైట్‌గా వేసుకోవాలి. మరీ నల్లగా గీతలు పడినా చెరపడం కష్టం. రంగుతో కప్పివేయొచ్చు అవసరమైతే.

డెకరేటివ్ డిజైన్‌లలో ఈ పోస్టరు కలర్‌లు బాగా వాడవచ్చు. ఆ డిజైన్‌లోని రంగులు, టోన్‌ల బేధం లేకుండా ఒకే షేడ్‌లో కనుపిస్తూ చూడముచ్చటగా, ఫ్లాట్‌గా వుంటాయి. ఆ డిజైన్‌లు వస్త్ర పరిశ్రమకు పనికి వస్తాయి.

మొత్తం పెయింటింగ్ అంతా పోస్టర్ కలర్‌తో చేస్తే జపాన్ వారి సాంప్రదాయిక పెయింటింగ్ లాగా, ఫ్లాట్‌గా వుంటుంది.

పోస్టరు కలర్‌లు కమర్షియల్ ఆర్ట్‌లో కూడా బాగా పనికి వస్తాయి. ముఖ్యంగా గోడ పోస్టరుల తయారీకి పనికి వచ్చే డిజైన్‌లు పోస్టరు కలర్‌లలో చిత్రించవచ్చు. అవి అచ్చంగా అలాగే ఆఫ్‌సెట్ ప్రెస్‌లలో ప్రింటవుతాయి. పోస్టరు డిజైన్‌లలో అందమయిన పెద్ద పెద్ద అక్షరాలను కూడా పోస్టరు రంగులతో నీట్‌గా వేయవచ్చు. వాల్‌పోస్టరు డిజైన్‌లకు వాడటం వల్లనే వీటికి పోస్టరు రంగులని పేరొచ్చింది.

నీటి రంగుల (Water Colours) పెయింటింగ్‌లలో కూడా కలర్, బ్లెండింగ్, కలర్ గ్రాడేషన్‌లు అవసరం లేని చోట అంటే రంగు ఫ్లాట్‌గా ఒకే టోన్‌లో కనబడవలసిన చోట పోస్టరు కలర్‌ను వాడవచ్చు. ఇది కూడా నీటి మీడియంతోనే వాడేదే గనుక ఆక్షేపణ వుండదు. అంతే గాక నీటి రంగుల పెయింటింగ్‌లలో పచ్చని ఆకులను పచ్చని గరిక గడ్డి పరకలను చిత్రించవలసిన దగ్గిర పోస్టరు పచ్చ రంగులతో కొన్ని బ్రష్ స్ట్రోక్స్ యిస్తే బాగుంటుంది. అలాగే, నీటి రంగులలో ఆకాశానికి నీలపు రంగు వాష్ ఇస్తాం. అది పూర్తిగా ఆరక ముందే ఆ నీలం రంగు మీద అక్కడక్కడ తెల్లని పోస్టరు కలర్ మరకలను అద్దాం అనుకోండి. అవి విస్తరించి వేఘాలలాగా బాగా కనిపిస్తాయి.

పోస్టరు రంగులను వాడటంలో అనుభవం సంపాదించిన వారు అయిల్ కలర్ పెయింటింగ్‌లవలె కనిపించే చిత్రిను చిత్రించ గలరు. ఈ రంగులతో కలర్ బ్లెండింగ్ చేస్తే వెలుగు నీడలనూ, లేత, ముదురు లను సమన్వయిస్తూ కూడా పెయింటింగ్ చేయవచ్చు. లేత రంగు కావాలంటే అయా రంగులకు తెలుపును కలపాలే గాని నీరు ఎక్కువ కలప వలసిన పని లేదని యింతకు ముందే చెప్పాను. కానీ ఈ పెయింటింగ్‌లు చాలా కాలం సంవత్సరాల తరబడి వుండటానికి పనికి రావు. ఎందుకంటే ఈ మందమయిన రంగులు ఎండిన (ఆరిన) తరువాత రాలిపోవచ్చు. వాటర్ కలర్ పెయింటింగ్‌లు, ఆయిల్ కలర్ పెయింటింగ్‌లు చాలా కాలం మన్నుతాయి. కమ్మర్షియల్ ఆర్టిస్టులు మాత్రమే యీ రంగులు ఎక్కువ వాడుతారు. ఎందుకంటే వారి బొమ్మ చాలా కాలం దాచుకొనే పని లేదు. ప్రింటయినంత వరకూ వుంటే చాలు. కనుక ఆయిల్ పెయింట్ చేసి ఎక్కువ ఖర్చు పెట్టుకోడం యెందుకు అని వారు యీ మీడియంనే వుపయోగిస్తారు. అంతే గాక ఈ రంగుల చిత్రం వేగంగా అవుతుంది. ఆయిల్ కలర్స్ రోజుల తరబడి ఆరవు. త్వరగా చిత్రించలేము.

పోస్టరు రంగు సీసాలోని రంగును పూర్తిగా ఎండిపోనివ్వ కూడదు. తడి తగ్గి పోతున్నప్పుడల్లా సీసాలో కొంత మంచి నీరు చుక్కలను వేయాలి.

రంగు సీసానుండి బ్రష్‌తో రంగును తీసుకుని పేపరు మాద వేసెయ్యవచ్చు. పేలట్‌తో పనిలేదు.రెండు రంగులు కలవ వలసి వచ్చినపుడే పేలట్ లోగాని, చిన్న పింగాణి ప్లేటులో గాని ఆ రెండు రంగు సీసాల నుండి కాస్త కాస్త రంగు తీసుకు వేసి కలుపుతాం.

# వాష్ డ్రాయింగ్

# WASH DRAWING

నీటిని ఎక్కువ కలుపుతూ రంగును వేసే దానిని వాష్ యివ్వడమంటారు. వాటర్ కలర్స్‌లో ఈ పద్ధతి వాడుకలో వున్నది. దాన్ని కలర్ వాష్ అంటారు. నల్లని నీటిరంగును గాని నల్లని ఇండియన్ ఇంక్‌ను గాని నీటితో కలిపి వాష్ యివ్వడాన్ని వాష్ డ్రాయింగ్ అంటారు.

వాష్ డ్రాయంగ్‌తో వేయబడిన చిత్రాలు నలుపూ తెలుపు ఫోటోల వలె కనిపిస్తూ ముచ్చటగా వుంటాయి. ఈ వాష్ డ్రాయింగ్ చిత్రాలు ఫోటోలలాగానే లెటర్ ప్రెస్‌లలో ప్రింటింగ్‌కు అనుకూలంగా వుంటాయి కూడా. కనుక ఈ విధానాన్ని కమర్షియల్ , ఆర్టిస్టులు కార్టూనిస్టులు విరివిగా వాడుతారు.

వాష్ డ్రాయింగ్‌కు నల్లని ఇండియన్ ఇంక్,నల్లని వాటర్ కలర్,నల్లని ఫ్యూజికలర్,నల్లని పోస్టర్ కలర్‌లు వాడుతారు. అన్నిటికంటె ఇండియన్ ఇంక్, నలుపు వాటర్ కలర్‌లే యెక్కువగా ఉపయోగిస్తారు.

ఈ రంగులు వాడటానికి మామూలు డ్రాయింగ్ పేపర్లు, వాట్‌మన్ పేపర్లు, మంచి కార్డ్ బోర్డ్‌లు, సన్‌లిట్ బాండ్ పేపర్లు వగైరాలు వాడవచ్చు. తెల్లని పేపర్లే వాడాలి. పోస్టర్ కలర్‌లకు వాడే రంగు పేపర్లు పనికి రావు. ఈ రంగులను వాడటానికి వాటర్ కలర్స్‌కు వాడే బ్రష్‌లేవైనా పనికి వస్తాయి. కేమెల్ హెయిర్, స్క్విరల్ హెయిర్, సేబుల్ హెయిర్ బ్రష్‌లు పనికి వస్తాయి. రౌండ్ బ్రష్‌లు ఫ్లాట్ బ్రష్‌లు పనికి వస్తాయి. సన్నని ఔట్‌లైన్‌లు వ్రాయడానికి O (జీరో) నెంబరు పాయింట్ బ్రష్ పనికి వస్తుంది.

స్కెచ్ వేసుకోవవడానికి HB డ్రాయింగ్ పెన్సిల్, రబ్బరు వున్నాయి కదూ. డ్రయింగ్ పేపరును బిగించడానికి డ్రాయింగ్ బోర్డ్‌గాని, రైటింగ్ పేడ్ గాని వుంటే చాలు. దాని మీద పిన్‌లతో బిగించవచ్చు.

ఈ రంగును పలుచన చేసుకోడానికి శుభ్రమైన నీరు కావాలి. బ్రష్‌లను కడిగాక తుడుచుకోడానికి మంచి గుడ్డ ముక్కలు కావాలి.

ఈ రంగులు త్వరత్వరగా ఆరిపోతాయి గనుక వేగంగా చిత్రించవలసి వుంటుంది. నిదానంగా చిత్రించడానికి వీలుండదు. ఒక వాష్ ఆరింతరువాత యిక మార్చడానికి వీలుండదు.మరోక వాష్ యిచ్చి డార్క్ చేయొచ్చు గాని లైట్ చెయ్యడానికి గూడా అవకాశం లేదు. వాష్ డ్రాయింగ్‌లలో తప్పులు దిద్దడం కష్టం. కనుక తప్పులు రాకుండ జాగ్రత్తగా వేయాలి.

లైట్‌గా గీసిన పెన్సిల్ స్కెచ్‌ని సిద్ధం చేసుకున్నారనుకోండి. ఇక వాష్ డ్రాయింగ్ మొదలు పెడదాం. వాటర్ కలర్ బాక్స్ లోని నల్ల రంగు ట్యూబ్‌ను తీసుకొని పేలట్ లోని నాలుగైదు గుంటలలో కొద్ది కొద్దిగా




పిండుదాం. ఒక గుంటలో రెండు చుక్కల నీరూ, మరొక గుంటలో ఐదారు చుక్కల నీరూ. మరొక దానిలో పది చుక్కల నీరూ, ఇంకొక దానిలో 20 చుక్కల నీరూ కలుపుదాం. ఇప్పుడు నాలుగు గుంటలలోనూ నాలుగు రకాల షేడ్‌లలో నల్ల రంగు తయారయింది. ఒకటి నల్లగా వుంటుంది. రెండోది సిమెంటు రంగులా వుంటుంది. మరొకటి బూడిద రంగులా వుంటుంది. నాలుగు టోన్‌లు తయారయ్యాయి కదూ. నీటి చుక్కల లెక్క పెట్టాలని లేదు, ఆయా రకాల టోన్‌లు లేదా షేడ్‌లు తయారయ్యే వరకు నీటిని కలపవచ్చు.

అలవాటయిన ఆర్టిస్టులు పేలెట్‌లో ఒకే చోట నల్ల రంగును పిండుకొని వుంచి దానిలో బ్రష్ పెట్టేటప్పుడల్లా ఆ బ్రష్‌కు తగినంత నీరును అంటించుకొని ఆ కుంచెను నల్ల రంగులో అంటించి వివిధ టాన్‌లను పూయగలరు.

చిత్రంలో లైట్ టోన్ వేయవలసిన చోట్లను ముందు పూర్తి చేయాలి. ఆ తరువాత బూడిద రంగు వేయవసిన దానిని; ఆ తరువాత సిమెంట్ రంగు పూయవలసిన దానిని, ఆఖరున చిక్కని నలుపు వేయవలసిన చోట్లను ఈ రంగులు పూయాలి. ఔట్ లైన్‌లు వేయాలి. ఈ విధంగా వాష్ డ్రాయింగ్‌ను పూర్తి చేస్తాం. ఈ చిత్రంలో హైలైట్‌లు వుండవలసిన చోటను కాగితం తెలుపునే రంగు పూయకుండా వుంచేస్తాం.

ఇండియన్ ఇంకుతో వేయబడే వాష్ డ్రాయింగ్‌లు ముచ్చటగా వుంటాయి. తరువాత తడిచినా కరిగిపోవు. వెలసిపోవు.

ఇండియన్ ఇంక్ కేక్స్ అని వుంటాయి. దానిపై తడిపిన బ్రష్‌ను రంగరించి రంగును తీస్తూ చిత్రంలో వేస్తాము. ప్రతిసారీ రంగు పలుచగా బూడిద రంగులోనే వస్తుంది. సిమెంటు రంగును సాధించాలంటే వేసిన దానిపైనే అరిన తరువాత మరల మరల కోటింగ్‌లు ఇస్తుంటే డార్కు అవుతూ వుంటుంది.ప ఇంకా నల్లని షేడు కావాలంటే మళ్లీ మళ్లీ అదే రంగును వేయాలి. ఒక కోటింగ్‌కూ ఒక కోటింగ్‌కూ మధ్య ఆరనిస్తుండాలి. ఆ విధంగా చాలా టైము పడుతుంది. ఇలా చిత్రించిన చిత్రాలు నిజంగా ఫొటోగ్రాఫ్‌లాగా వుంటాయి.

ఇండియన్ ఇంక్ చుక్కలను పేలెట్‌లోని గుంటలలోనే వేసుకుని వివిధపాళ్లలో నీరు కలిపి కూడా రకరకాల షేడ్‌లు చేయవచ్చు. ఇదిచాలా స్పీడ్‌గా చేయాలి. స్ట్రోక్‌లు వెంటవెంటనే ఆరిపోతుంటాయి.

# ఆయిల్ పెయింటింగ్

# OIL PAINTING

ప్రపంచ చరిత్ర చూస్తే నూనె రంగుల వాడకం అన్నింటి కంటె వెనుక (15వ శతాబ్దంలో) వచ్చినా అన్నిటి కంటె ఎక్కువ ప్రాముఖ్యతను ప్రాధాన్యతను సంతరించుకున్నది. ఎందుకంటే ఇది. అత్యంత ఉపయోగకరమైనదీ, మేలైనదీ సులవైనదీగా భావించబడుతున్నది.

ఈ రంగులు శతాబ్దాల తరబడి నిలబడగలవు. వర్షానికి, వాతావరణానికీ తట్టుకుంటాయి. ఈరంగులలో ప్రకాశ వంతమయినవీ, చీకటివీ అన్ని రకాలూ వుంటాయి. ఈ రంగులతో ఏ వస్తువునైనా , ఏ వాతావరణాన్నయినా చిత్రించవచ్చు. ఇవి వాడటం సులుపు. తప్పులను దిద్దుకోడానికి కూడా వీలుంటుంది. కాగితం మీద గాని, గుడ్డ మాద గాని, కేలికోమీద గానీ,చెక్కమీద గానీ, సిమెంట్ గోడమీద గానీ, గాజు అద్దం మీద గాని, పింగాణి మీద గానీ,తోలు మీద గానీ పూయడానికీ ఈరంగులు వుపయోగపడతాయి.

ఈ రంగులు చిక్కనయనవి, మందమయినవి. కనుక బాడీ (Body) కలర్స్ అనీ, ఒపేక్ (Opaque) కలర్స్ అనీ అనబడతాయి. అంటే నీటి రంగులవలె Transparent గా వుండవు. ఈ రంగులలో ఏ రంగునయినా లైట్ కలర్ చేసుకోవాలంటే ఆరంగులో తెలుపు రంగును కలుపుకోవాలి. ఒక రంగు ఆరిపోయిన తరువాత దాని మీద మరొక రంగును వేస్తే అడుగు రంగు కనిపించదు. కప్పుపడిపోతుంది. కనుక మనకు నచ్చని రంగులపై వేరే రంగులను మరల వేసుకోవచ్చు.

ఈ నూనె రంగులు నిదానంగా ఆరుతాయి. ఒక్కోసారి రెండు మూడు రోజులు కూడా పట్టవచ్చు. ఒక రంగు పూత మీత మరోక రంగును వేయ్యాలంటే ముందు వేసిన పూతని వారం రోజులయినా ఆరనివ్వడం మంచిది. అడుగున వున్న రంగు పూర్తిగా ఆరకుండానే మరొక రంగు వేస్తే ఆ రెండూ ఆరడం లోనూ, సంకోచించడంలోనూ, తేడాలువచ్చి పై పూత బీటలు ఇవ్వవచ్చు. కనుక ఎంత ఆరనిస్తే అంత మంచిది

ఈ ఆయిల్ మీడియంలో స్టిల్ లైఫ్‌లు, లాండ్ స్కేపులూ, పోర్ట్రయిట్‌లు,చిత్రించవచ్చు. స్టిల్ లైఫ్ అంటే వస్తు సముదాయమో, ఫలమో, పూల గుత్తుతో చిత్రించడం. లాండ్ స్కేప్ లంటే ప్రకృతి దృశ్యం. అంటే ఔట్ డోర్ సీనరీ అన్నమాట. పోర్ట్రయిట్ అంటే మనుషులను, ముఖాలనూ చిత్రించడం.

ఈ ఆయిల్ పెయింటింగ్‌లలో సాంప్రదాయరీతి నుండీ వాస్తవికతను, ఆధునికత వరకు అన్ని రకాల పెయింటింగ్‌లను వేయవచ్చు. రంగులు మందంగా పూయబడటం వల్ల చిత్రంలో Texture ను (గరుకు తనాన్ని లేదా నునుపు దనాన్ని) సృష్టించవచ్చు కూడా.




## పరికరాలు:-

ఆయిల్ పెయింటింగ్‌కు కాస్త ఖర్చుతో కూడిన పరికరాలే అవసరమౌతాయి.

## రంగులు :

ఆయిల్ కలర్స్ ట్యూబులలో వుంటాయి. ఒకే పెట్టెలో 12 రంగుల ట్యూబులు వుంటాయి. ఇంకా విడిగా అనేక రంగులు దొరుకుతాయి. అన్ని రకాలనూ వాడవలసిన పనిలేదు. అనేక రంగులను ప్రాథమిక, ద్వితీయ రంగుల కలయికతో తయారు చేసుకోవచ్చు. తెలుపు రంగు యెక్కువగా అవసరమవుతుంది. కనుక Flake White పెద్ద ట్యూబునే కొనుక్కోవాలి.

## కుంచెలు :-

బిరుసుగా వుండే హాగ్ హెయిర్ బ్రష్‌లనూ, మెత్తగా వుండే సేబుల్ హెయిర్ బ్రష్‌లనూ వాడవచ్చు. చదునయిన తలములపై నీటయిన పెయింటింగ్‌లకు మెత్తని బ్రష్‌లనే వాడాలి. కేన్వాసుల గరుకు తలం మీద పెయింట్ చెయ్యడానికి బిరుసు కుంచెలే నయం. ఆయిల్ పెయింటింగ్‌లో ఎక్కువగా ఫ్లాట్ బ్రష్‌లే వాడబడతాయి. అయినప్పటికీ మృధువైన పనికి రౌండ్ బ్రష్‌లూ, ఔట్‌లైను వర్కుకి పాయింట్ బ్రష్‌లూ వాడబడుతుంటాయి.

## పేలెట్ :-

ఇది రంగులు కలుపుకునే చెక్క. ట్యూబుల నుండి దీని మీదకు రంగును పిండుకొని ఈ పేలెట్ మీద నుండి బ్రష్‌లతో తీసుకుని వాడతాం. రెండు రంగులను కలపాలన్నా, రంగును నూనెతో పలుచన చెయ్యాలన్నా దీని మీదనే చేస్తాం. చెక్క పేలెట్ ను కొనలేని వారు పింగాణీ సాసరునో, గాజు అద్దం ముక్కనో, మేసనట్ బోర్డు ముక్కనో పేలెట్‌గా వాడవచ్చు.

## పేలెట్ నైఫ్ :-

ఇవి చాకులలాగానూ, తాపీల వలెనూ వుంటాయి. స్టీలుతోనో, రేకుతోనో చేయబడి వుంటాయి. రంగులను కలపడానికి, రంగును నూనెనూ కలపడానికీ వీటిని వాడతాం. పేలెట్ నైఫ్‌తో పెయింట్ కూడా చెయ్యచ్చు.

## కేన్వాస్ :-

సాధారణంగా ఆయిల్ పెయింటులు వేసేది "కేన్వాసు"ల మీదనే. ఇది ప్రైమర్ పూతతో పెయింటు చెయ్యబడిన ముదురు గుడ్డ. ఇవి చేసినవి అమ్ముతారు. మనం కొత్త ముదురు గుడ్డను తీసుకొని ఇనపకొట్లలో లభించే "ప్రైమర్" అనే పెయింటును వెడల్పాంటి బ్రష్‌తో పూసి ఆరబెట్టి దీనిని తయారు చేసుకోవచ్చు. అట్టకు అతికిన 'టీకేన్వాస్ బోర్డులు" కూడా కొట్లలో దొరుకుతాయి. నేర్చుకొనే దశలో మనం "ఆయిల్ స్కెచింగ్ పేపరు" ను వాడవచ్చు. ఈ పేరుతోనే కొట్లలో దొరుకుతుంది. ఆయిల్ పెయింట్ ను సిమెంటు గోడ మీదా, ప్లైవుడ్‌చెక్క మీదా, గాజు అద్దం మీదా, తోలు మీదా, ప్లాస్టిక్ మీదా, పింగాణీ మీదా, పెయింట్ చేయ్యవచ్చు. కేన్వాసు గుడ్డను చెక్క ఫ్రేముకు బిగించి పెయింటింగ్‌కు సిద్ధం చేసుకోవాలి. స్కెచింగ్ పేపరునయితే డ్రాయింగ్ బోర్డుపై పిన్నులతో బిగించి పెయింటింగ్ మొదలు పెట్టవచ్చు.

## నూనెలు :-

రంగులను పలుచన చెయ్యడానికి లిన్‌సీడ్ ఆయిల్ (అవిశ నూనె)ను వాడుతాం. బ్రష్‌లను కడుక్కోడానికీ రంగులను మరీ పలుచన చేసుకోడానికీ టర్పెంటయిన్‌ను వాడతాం. ఆరిన పెయింటింగ్ పై కోటింగ్ యివ్వడానికి పిక్చర్ వార్నిష్‌ను వాడుతాం. ఈ మూడూ సీసాలలో లభిస్తాయి. వీటి వాడకం తప్పని సరి.

## ఈజెల్ :-

కేన్వాసు ఫ్రేమును ఆనించడానికి పనికి వచ్చే స్టాండు. నిల్చుని వేసుకోడానికీ, కూచుని వేసుకోడానికి రకరకాల ఈజెల్ లు వుంటాయి. ఇది చాలా ఖరీదు గనుక దీనిని కొనలేని వాళ్ళు కేన్వాస్ గోడకో, టేబుల్‌కో ఆనించి పెయింట్ చేసుకోవచ్చు.

## స్కెచింగ్ మెటీరియల్ :-

ఆయిల్ స్కెచింగ్ పేపరుపై నయితే పెన్సిల్‌తోనే స్కెచ్ వేసుకోవచ్చు. కేన్వాసు పైన అయితే కొందరు పెన్సిల్‌ని వాడుతారు. మరి కొందరు చార్‌కోల్‌ని వాడుతారు. చార్ కోల్ అనేని బొగ్గు పుల్లలు. ఈ బొగ్గు పెన్సిళ్లు కూడా వుంటాయి. మరి కొందరైతే ఈ స్కెచింగ్‌కి పై రెంటినీ వాడకుండా పలుచని బూడిద రంగు లాంటి దాన్ని వాడుతారు. ఈ రంగును యెలాచేసుకుంటారంటే, ఆయిల్ కలర్స్‌లోని బరంట్ అంబర్‌ని, ఫ్రెంచ్ అల్ట్రా మెరీన్ బ్లూని కలుపుకొని అందులో కాస్త టర్పంటయిన్ వేసి సన్న బ్రష్‌తో వేసుకోడానికి పనికొస్తుంది.

## క్లీనింగ్ :-

టర్పెంటయిన్‌తో కడిగిన బ్రష్‌ను తుడుచుకోడానికి గుడ్డ ముక్కలుండాలి. బ్రష్‌లను వారానికోసారి సబ్బుతోగాని సర్ఫ్‌నీళ్లలో కడగాలి. అప్పుడు ఫ్రెష్‌గా వుంటాయి.

## పెయింటింగ్ మొదలెడదాం :-

ఆయిల్ స్కెచింగ్ పేపరు ముక్కను తీసుకొని కావలసిన బొమ్మనుస్కెచ్ వేసుకుందాం.

తరువాత కావలసిన రంగులను పేలెట్‌పై పిండుకొందాం. రంగు తగినంత పలుచగా వుంటే దానినే ఆఫలంగా వేసెయ్యవచ్చు. రంగు మరీ ముద్దగా వుంటే దానిమీద రెండు చుక్కల లిన్‌సీడ్ ఆయిల్ పోసి పేలెట్ నైఫ్‌తో అదుముతూ పలుచన చేసుకోవాలి.

రెండు గాని మూడు గాని రంగులను కలపాలనుకోండి ఆ రంగులను తగినంత పాళ్లలో పేలెట్‌పై పిండుకొని కొన్ని చుక్కలు లిన్‌సీడ్ అయిల్‌ను పోసి చాకుతో అదుముతూ కలపాలి. కొత్త రంగు తయారవుతుంది.

ఎక్కవ ఏరియాను చదునుగా రంగుతో నింపడానికి పెద్ద రౌండ్ బ్రష్‌ను గానీ ఫ్లాట్ బ్రష్‌నుగానీ వాడవచ్చు. ఫ్లాట్ బ్రష్‌లతో పేచ్‌లు పేచ్‌లు గానూ అంటించవచ్చు. చిన్న రౌండ్ బ్రష్‌తో అంటిస్తే అదొక రకమైన ఆకుల లాంటి మచ్చలు వస్తాయి. చిక్కని రంగును తాపీతో అంటించితే పెచ్చులు పెచ్చులుగానూ, రేఖల రేఖలుగానూ కనిపిస్తుంది. మొత్తం మీద రంగులను మందంగా అంటించితేనే బొమ్మ అందం గానూ, నేచురల్ గానూ వుంటుంది. సన్నని రేఖల కోసం పాయింట్ బ్రష్‌లనే రంగును కాస్త పలుచన చేసుకొని వాడతాం.

ఒక యాపిల్ పండు బొమ్మనే వేస్తున్నాం అనుకోండి. దాని అసలు రంగు వెర్మిలియన్ ఎరుపును పేలెట్‌పై వుంచుదాం. ఆ పండు మీద వెలుతురు చూపడానికి ఆ ఎరుపుతో తెలుపు కలిపి వాడుతాం. ఆ

పండుపైని నీడను చిత్రించడానికి ఆ ఎరుపుతోనే ఒక నీడ రంగును కలిపి వేయాలి. నీడ రంగును క్రిమ్సన్ ఎరుపు + వరిడియన్ గ్రీన్ లను కలిపి చేసుకుంటాం. ఆ నీడరంగును యాపిల్ పండు రంగు అయిన వెర్మిలియన్ఎరుపుతో కలిపి వెయ్యాలి. అప్పుడు సరి పోతుంది. ఆ పండు మీద వెలుగూ నీడ లేని చోట యాపిల్ రంగునే పూస్తాం. ఆ పండు మీద పడిన మెరుపుల వద్ద తెల్లని ఫ్లేక్ వైట్ మచ్చలు పెడతాం. యాపిల్ పండు అయిపోయింది.

ఆయిల్ పెయింట్‌లలో ఏ రంగయినా లైట్ కావాలంటే తెలుపు (Flake White) ను కలుపు కుంటాం. ఆయిల్ కలిపితే లైట్ అవుతుందని భావించరాదు. లేత (light) రంగుల కోసం ఆకుపచ్చతో లెమన్ యెల్లోను, ఎరుపు, ఆరెంజ్‌లతో క్రోమ్ యెల్లోను కలుపుతాం.

ఆయిల్ కలర్స్ పెయింటింగ్‌ను, లైట్ కలర్స్‌తో మొదలు పెట్టాలని గానీ, డార్కు కలర్స్‌తో మొదలు పెట్టాలని గానీ లేదు. ఎలాగైనా మొదలు పెట్ట వచ్చు. పైన మొదలు పెట్టడం మంచిది.

బొమ్మ నీటుగా నునుపుగా రావాలంటే మొత్తం అక్కడున్న అన్ని రంగులూ రెండోసారి కోటింగు ఇవ్వాలి. ఈ రకం పనికి మెత్తని సేబుల్ హెయిర్ బ్రష్‌లనే వాడాలి.

రంగు ఆరకుండా మరొక రంగువేస్తే ఆ రెండూ కలుస్తాయనీ, ఆరిన తరువాత వేస్తే దేనికదే వుంటుందనీ గుర్తుంచుకోవాలి.

ఎక్కడయినా వేసిన రంగు మనకు నచ్చకపోతే దానికి చాకుతో గీకివేసి మరల కొత్త రంగు వెయ్యోచ్చు. లేదా మొదటి రంగును ఆరనిచ్చయినా కొత్త రంగు వెయ్యొచ్చు.

రంగు వేయడం అయిపోయిన తరువాత బ్రష్‌లను టర్పెంటైన్‌లో ముంచి గుడ్డకు తుడుస్తూ రంగును వదిలించాలి. మరల వేరొక రంగులో ఆబ్రష్‌నే పనిచేయించవచ్చు. మొత్తం ఆరోజుకు పెయింటింగ్ పని అయిపోతే బ్రష్‌లను టర్పెంటైన్‌తోనే గాక సబ్బునీళ్లతో గూడా కడుక్కొని దాచుకొంటే బ్రష్‌లు పాడవ్వవు. ఆయిల్ పెయింట్‌తో బ్రష్‌ను ఆరనిచ్చామా ఆబ్రష్ చెడిపోయింగన్న మాటే.

పెయింటింగ్ బాగా ఒక నెల రోజులు ఆరిన తరువాత ఒక వెడల్పాంటి బ్రష్‌ను వార్నిష్‌లో ముంచి పెయింటింగ్ మీద పూయాలి. మొత్తం పెయింటింగ్ అంతా పూయబడాలి. అప్పుడది చూడడానికీ బాగుంటుంది. చెడిపోకుండానూ వుంటుంది. వార్నిష్‌ను ఒకే చోట మరీ మరీ రుద్ద కూడదు. ఆరిన రంగు కరగవచ్చు.

ఆయిల్ పెయింటింగ్ మొదట చికాకుగా వున్నా అలవాటయిన కొద్దీ సరదాగా వుంటుంది. స్టిల్ లైఫ్‌లనూ పోర్ట్రయిట్ లను, లాండ్ స్కేపులనూ ఆయిల్ పెయింట్‌తో చిత్రించండి.

బ్రష్‌లను వాడకుండా మొత్తం పెయింటింగ్ అంతా పేలెట్ నైఫ్‌తో చేసే టెక్నిక్‌ను "పేలట్ నైఫ్ వర్కు" అంటారు. అలాంటి పెయింటింగ్‌లు చూడముచ్చటగా వుంటాయి. ఫేషన్‌గా వుంటాయి. ఇలా వేయడానికి కేన్వాసు బోర్డులుగాని, కేన్వాసులుగాని పనికొస్తాయి. ఈ రీతి చిత్రణలో పెయింట్‌లు బాగా ఖర్చవుతాయి.

ఇది 20వ శతాబ్దంలో సాధించబడిన ఆధునిక మైన పెయింటింగ్ విధానం. అభివృద్ధి చెందిన దేశాలలో వాడుకలో వున్నది. పెయింటింగ్‌లలో కెల్లా యిది అనుకూలమైన విధానంగా భావించబడుతున్నది. బహిరంగ ప్రదేశపు గాలిలో కూడా యీ పెయింట్‌లు ప్రకాశాన్ని కోల్పోవు. అవి నీటితో కలిపి వాడబడతాయి కనక త్వరగా ఆరిపోతాయి. కనుక ఆయిల్ పెయింట్‌ల కంటే వేగంగా పూర్తి చేయవచ్చు. నిధానంగా పెయింట్ చెయ్యాలన్నా అనుకూలంగా వుండేందుకు నిదానంగా ఆరడం కోసం కలిపే ద్రవాలుంటాయి. ఈ విధానంతో చిత్రించిన పెయింటింగ్‌లు చాలా కాలం చెడిపోకుండా వుంటాయట. ఆయిల్ పెయింటింగ్ కంటే చికాకు తక్కువ. అలవాటు పడిన వారు యీ విధానాన్నే అనుసరిస్తారు.

ఈ విధానంలో చాలా పరికరాలుంటాయి. పెయింట్ చెయ్యడానికి బ్రష్‌లుగానీ, పేలెట్ నైఫ్ (రంగులు కలిపే చాకు) గానీ, స్పాంజి ముక్కలు, గుడ్డ ముక్కలు వాడవచ్చు. ఆయిల్ పెయింటింగ్ లాంటి ఫలితాలు వస్తాయి. ఈ పెయింటింగ్ ఆరిన తరువాత గాని, ఆరక ముందు గానీ, గ్లేజింగ్ మీడియంని స్పాంజితో అప్లయి చేయవచ్చు. పెయింటింగ్ మెరుస్తూ వుంటుంది.

ఈ పెయింటింగ్ చేసిన, తరువాత బ్రష్‌లను వెంటనే శుభ్రంచేసుకోవాలి, లేదా పాడయిపోతాయి.

## పరికరాలు :

Acrylic Brushes బ్రష్‌లు : ఏక్రయిలిక్ బ్రష్‌లని ప్రత్యేకంగా వుంటాయి. అందులో రౌండ్‌వి, ఫ్లాట్‌వి వివిధ సైజుల్లో వుంటాయి. అవి దొరక్కపోతే సేబుల్ హెయిర్ బ్రష్‌లను వాడొచ్చు.

Water నీరు : ఈ రంగులను నీటితోనే కలిపి వేయాలి.

Gloss Medium గ్లాస్ మీడియం : పెయింట్‌కు నునుపు నివ్వడానికి కలిపేది.

Acrylic Gesso ఏక్రైలిక్ గెస్సో : గుడ్డ మీద పెయింట్ చెయ్యడానికి ముందు ప్రైమరుగా పూసేది.

Matte Varnish మేట్ వార్నిష్ : మెరిసేలా వుండటానికి పూసేది.

Texture Paste టెక్శ్చర్ పేస్ట్ : ప్రత్యేకమయిన ఫలితాల కోసం కలిపేది. గరుకు దనం కోసం కలుపుతారు.

Matt Medium మేట్ మీడియం : పెయింట్ ని డల్ చేయుటకు.

Pure Polymer Medium ప్యూర్ పోలిమర్ మీడియం : పెయింట్‌కు చిక్కదనం కలిగించుటకు కలిపేది.

Mixing Tray మిక్సింగ్ ట్రే: రంగు కలుపుకునే ప్లాస్టిక్ ప్లేటు.

Palette Knife పేలెట్ నైఫ్ : రంగులు కలుపు కునే చాకు లేదా తాపీ లాంటా పనిముట్టు.

Colour Chart కలర్ చార్ట్ : రంగుల పట్టీ,కలర్స్‌తో పాటు యివ్వబడుతుంది.

Acryllic Colours ఏక్రైలిక్ కలర్స్ : ఆయిలు కలర్స్, వాటర్ కలర్స్ లాగానే అనేక రంగులు ట్యూబులలో వుంటాయి.

Clove oil లవంగ నూనె : కొందరు చిత్రకారులు ఈ నూనెను కూడా కాస్త కలుపుతారు.

Rags గుడ్డ ముక్కలు

Masking Tape మాస్కింగ్ టేప్ : అవసరమయినప్పుడు కొన్ని ఏరియాలును కప్పి వేయడానికి అంటించే ట్రాన్స్పరెంటుగా వుండే గమ్ టేప్. రంగు వేసిన తరువాత దానిని వూడతీస్తారు. ఆ టేపు అంటించిన మేరకు వేసిన రంగు పడకుండా వుంటుంది.

Canvas : కేన్వాస్ క్లాత్ గాని, కేన్వాస్ క్లాత్ అటించిన "కేన్వాస్ బోర్డ్" గాని ఈ పెయింటింగ్‌లు చేయడానికి వాడుతారు.

Paper : మందమయిన డ్రాయింగ్ పేపరు, గట్టి వాటర్ కలర్ పేపరు కూడా వాడొచ్చు.

గమనిక :- బజారులో "ఏక్రైలిక్ డిస్టెంపరు" పేరుతో వున్న పెయింట్లు వేరు. అవి గోడలకు, బిల్డింగులకు పూసేవి. ముచ్చటగా యీ "ఏక్రైలిక్" పేరును ఆ పెయింట్లకు పెట్టుకున్నారు. ఈ రకం ఏక్రైలిక్స్ మనదేశంలో ఈమధ్యనే వాడుకలోనికి వచ్చింది. బొంబాయి, ఢిల్లీలాంటి నగరాల్లో వాడుతున్నారు.

ఆయిల్ పెయింటింగ్‌లకు బదులుగా ఏక్రైలిక్ పెయింటింగ్‌లు వాడుకలోనికి వస్తున్నాయి. ఎందుకంటే నీటి మీడియంతోనే పెయింటింగ్ చేయవచ్చు. రంగు మందంగా వుంటుంది గనుక రంగు మీద రంగు పెయింట్ చేసి తప్పులను కప్పివేయవచ్చు. తొందరగా ఆరిపోతుంది. పెయింట్ మందంగా వుండి అయిల్ పెయింట్ వలెనే కనిపిస్తుంటుంది. ఎక్కువ కాలం మన్నుతుంది. ఈ మీడియంతో కూడా ఆయిల్ పెయింటింగ్‌ల వలెనే ప్రకృతి దృశ్యాలు, స్టిల్ లైఫ్ లు, ఫిగర్‌లు చేసుకోవచ్చు. ఈ విధానంలో మొదట నల్లటి రంగులూ వేసి వాటిపై లేత రంగులు కూడా వేయవచ్చు. Dark Colours కప్పాడి పోతాయి.

ఒక ప్రకృతి దృశ్యాన్ని మన స్కెచ్ బుక్‌లో స్కెచ్ వేసుకొని వద్దాం. దాని లాంటిదే కేన్వాస్ బోర్డు మీదకు ఫ్రీహాండ్‌తోనే 2B పెన్సిల్‌తో స్కెచ్ వేద్దాం. దానిపై మొదట ఆయా రంగులను పలుచగా నీళ్ళు కలిపి పపలుచని పూతలు పూద్దాం. ఆకాశం, కొండలు, నీరు, పచ్చని నేల వున్నాయనుకొండి. వాటి వాటి సాధారణ రంగులనే పలుచగా వేస్తాం. అంతే గాక ఈసారి వెలుగు నీడలు ఎత్తు పల్లాలు లాంటి వర్ణ భేదాలను కూడా రంగులలో చూపిస్తాం. ఆఖరున ఆకాశంలో మేఘాలూ, నీటిలో అలలూ, నేల మీద మొక్కలు లాంటి వివరాల

(Details) ను, అవసరమైతే సన్నని బ్రష్‌తో వేస్తాం. ఆ విధంగా లాండ్ స్కేప్‌ని పూర్తిచేయ్యొచ్చు. లాండ్ స్కేప్‌లు చాలా వేసేటప్పటికి ఈ రంగుల స్వభావం అర్థం అవుతుంది. అప్పుడు మరింత నైపుణ్యంతో అందంగా వేయ గలుగుతాం. ఈ విధానంతో సాంప్రదాయకమైన నునుపైన చిత్రాలు చేయొచ్చు. ఆధునికమైన, చురుకైన (Rough Textured) పెయింటింగ్‌లు చేయొచ్చు. సాంప్రదాయక వాటర్ కలర్ లాగా వాష్ టెక్నిక్ చెయ్యొచ్చు. పేలెట్ నైఫ్ టెక్నిక్ చెయ్యొచ్చు.

సాధాణంగా యీ టెక్నిక్‌లో ఆయిల్ పెయిలంటింగ్‌లాగా ముందు పలుచని రంగులతో మొత్తం పెయింటింగ్‌ని పూస్తారు. దానిని Under Paintings అంటారు. మరల దానిపై చిత్రం అంతా పెయింటు చేయబడుతుంది.

ఒక రెమ్మ స్కెచ్ వేసుకుందాం. దీనిలో అకులకు అకుపచ్చ,. పళ్ళకు ఎరుపు, బ్యాక్ గ్రౌండ్‌కు పసుపు పలుచగా ముందుకోటింగ్ యిద్దాం. తరువాత అది ఆరిన తరువాత మరల ఆకులను, పళ్ళను, కొమ్మను వెలుగు నీడలు వచ్చే విధంగా నెమ్మదిగా అవసరమైన రంగులను చిక్కగా వాడుతూ పూర్తి చేద్దాం. కావలసిన ఫలితాలు వచ్చే వరకు ఎన్ని సార్లయినా ఒకదాని మీద ఒకటి రంగులు వేసుకోవచ్చు. రెండో రంగు వేసే ముందు ఆరనివ్వాలి.

ఏక్రైలిక్ కలర్స్ ప్రకాశవంతంగా మెరుస్తూ వుంటాయి. గనుక ఫలములు, పుష్పములు వేయడానికి చాలా బాగా పనికొస్తాయి.

మన ముందు పేర్చుకొనిన వస్తువుల స్కెచ్‌ని HB పెన్సిల్‌తో డ్రాయింగ్ బోర్డుకు పిన్నులతో బిగించిన వాటర్ కలర్ పేపరు మీద లైట్‌గా వేసుకుందాం. ఆయా వస్తువుల జనరల్ రంగుని పలుచగా ముందు పూద్దాం. అది బాగా ఆరిన తరువాత చిక్కని రంగులతో వెలుగు నీడలను, మిట్ట పల్లాలను, చక్కగా చిత్రిద్దాం. ఆఖరున తెల్లని రంగును అక్కడక్కడ అవసరమయినచోట బ్రష్‌తో అంటించి మెరపులను చిత్రిద్దాం.

నీలపు లేదా ఊదా రంగు లేదా పచ్చ బ్యాక్ గ్రౌండ్‌లో ఎర్రని మరియు నారింజ రంగులో గాని లేదా పసుపు రంగుల ఫలాలు చిత్రించామనుకోండి, కూల్ కలర్స్, హాట్ కలర్స్ కలసి మెలసి క్రాంట్రాస్టుతో ఎంత ముచ్చటగా వుంటాయో ట్రై చేసి చూడండి.

ఎక్రైలిక్ పెయింట్లతో పోర్ట్రయిట్ కూడా అందంగా వేయొచ్చు. ముందు డార్కు కలర్స్‌లో అండర్ పెయింటింగ్‌ను పలుచగా వేసి తరువాత ప్రకాశవవంతమన రంగులతో, డ్రై బ్రష్ టెక్నిక్‌తోగాని, పేలెట్ నైఫ్ తో గాని చిక్కని రంగులను వేసి మంచి ఫలితాలు సాధించవచ్చు.

ఏక్రైలిక్స్ పెయింట్లు చిక్కగా మందంగా వుంటాయి. పొరపాటుగా వేసిన రంగులను లేదా భాగాలను మరల కావలసిన రంగు వేసి కప్పివేసి సవరించుకోవచ్చు. రంగులు వెంట వెంటనే ఆరిపోతాయి గనుక ఇలాంటి మార్పులు త్వరగానే చేసుకోవచ్చు.

ఏక్రైలిక్స్ రంగులు మన దేశంలో ఇహాడిప్పుడే వాడుకలోకి వస్తున్నాయి. పెద్ద పట్టణాలలో వాడుతున్నారు. అందుబాటులోనికి రాగానే మనమూ అలవాటు చేసుకోవడం మంచిది.

# టెంపేరా కలర్స్

## Tempara Colours

ఆయిల్ పెయింటింగ్ వాడుకలోకి రాక ముందే యీ విధానం వాడుకలో వుండేది. 15 శతాబ్దపు పశ్చిమ దేశాల చర్చీల గోడలపై వేయబడిన పెయింటింగ్‌లు యీ మీడియంతో వేయబడినవే. ఇప్పటికీ యీ విధానం అమలులో వుంది. ఈ పెయింటింగ్ ఉపరి తలంఅత్యంత నునుపుగా వుండడమే దీని ఆకర్షణ. ఈ పెయింటింగ్‌లను తక్కువ శ్రమతోనే, కొలది పరికరాలతోనే తయారు చేయొచ్చు.

టెంపేరా మీడియంకు మూల పదార్థం కోడి గుడ్డుసొనే. మంచి మంచి రంగు పొడులతో దానిని కలిపి చిత్రించడమే. కొందరు మొత్తం సొన వాడతారు. కొందరు పచ్చ సొన మాత్రమే వాడతారు. మరి కొందరు గుడ్డు సొనతో పాటు ఆయిల్ కూడా కలుపుతారట. కోడిగ్రుడ్డు మటుకు కొత్తది, మంచిది వాడాలి. నిలవవున్నగుడ్డు వాడకూడదు. రంగు కలిపిన తరువాత కూడా నిలవ వుంచ కూడదు. ఏ రోజు కలిపిన రంగు ఆ రోజే వాడెయ్యాలి. సొన కలిపిన రంగు ఒక రోజు ఆలస్యంగా వాడినా పాడయిపోతాయి. రంగు కలిపే చాకు, రంగు కలిపే కల్వం, రంగులు కలుపుకొనే గాజు పలక మొదలైనవన్నీ కూడా ఎప్పటికప్పుడు కడిగి శుభ్రంగా వుంచాలి. ఏ మాత్రం లోపం జరిగినా పెయింటింగ్‌కు బూజు పట్టవచ్చు.

సాధారణంగా టెంపేరా పెయింట్లు చెక్క బల్లలపై పెయింటు చేస్తారు. ముందుగా ఆ బల్ల (బోర్డు) పై 'గెస్సొ' (Gesso) అనబడే దాన్ని పూస్తారు. ప్రైమర్ వేయడమన్న మాట. దానిపై రుద్ది పాలిష్ చేసి చదునుచేస్తారు.దానిపై పెయింట్ చేస్తారు.

ట్యూబ్‌లలో చిక్కని ద్రవరూపంలో వున్న టెంపేరా రంగులకంటే ఆరంగు పొడులను ఎప్పటికప్పుడు కలుపుకొని వాడటమే మంచి విధానం.

ఈ విధానంతో పోర్ట్రయిట్‌లను, ఫిగర్‌లను (మానవ రూపాలను) చిత్రించడం సాంప్రదాయం. ప్రకృతి దృశ్యాలను, స్టిల్ లైఫ్ లనూ చిత్రించవచ్చు. ఈ పెయింటింగులు నునుపుగా వుండి అజంతా పెయింటింగులలాగా ఆహ్లాద కరంగా వుంటాయి.

పరికరాలు : ఈ విధానంలో చాలా కొద్ది పరికరాలే వుంటాయి.

రంగులు : పరిశుభ్రమయిన రంగు పొడులు, వాటర్ కలర్ పౌడర్స్ అని అమ్మబడతాయి. ముఖ్యమయిన

రంగులన్నీ దొరుకుతాయి. ట్యూబు లలో కూడా యీ రంగులు "టెంపెరా కలర్స్" పేరుతో చిక్కని ద్రవ రూపంలో లబిస్తాయి. కానీ అంత బాగోవు.

నీరు . Distilled Water మందుల షాపులలో దొరుకుతుంది. మామూలు నీరు వాడకూడదు.

పేలెట్ : Mixing Dish : రంగులు కలిపే డిష్లు, ప్రమిదలు లాంటివి పింగాణీవి గాని, ప్లాస్టిక్‌వి గాని దొరుకుతాయి.

గుడ్డు సొన : (Fresh Egg) : మంచి క్రొత్త గుడ్డు కావాలి.

బ్రష్‌లు : Sable Brushes : సేబుల్ బ్రష్‌లు రౌండ్‌వి, ఫ్లాట్‌వి వివిధ సైజులలో అవసరం. ఫ్లాట్ బ్రష్‌లు ప్రైమర్ కోటింగులకూ, ఎక్కువ ఏరియాలలో రంగు పూయడానికి పనికొస్తాయి.

ప్రైమర్ : Gesso : గెస్సో అనబడే దాన్ని ప్రైమరుగా పూయడానికి వాడుతారు. అది దొరక్క పోతే Wood Primer వాడాలి.

## టెంపేరాను తయారు చేయుట :

గ్రుడ్డును పగులగొట్టి సొనను ఒక గాజు గ్లాసులో వేయాలి. దానితో అందులో సగం డిస్టిల్డ్ వాటర్ (శుభ్రమైన నీరు)ని కలపాలి. దానిని స్పూనుతో బాగా కలపాలి. అదే టెంపెరా మీడియం. రంగులు కలిపే డిష్‌లలో కావలసిన రంగు పొడిని ఒక చిటికెడు చొప్పున వేసుకుంటాం.

ఇప్పుడు టెంపెరాలో బ్రష్‌ను ముంచి ఆ బ్రష్‌ను కలర్ మిక్సింగ్ పేలెట్ పైన వేయబడి వున్న కలర్ పొడరులో కలిపి రంగును తయారు చేసుకుంటాం.

మార్కెట్ లో "టెంపెరా కలర్స్" పేరుతో లభించే కలర్ ట్యూబులలోని రంగులతో కోడిగుడ్డు సొన కలిపి వాడవచ్చు. కానీ అలా చేసిన వాటి వల్ల మంచి ఫలితాలుండవు. అవి తొందరగా ఆరవు కూడా. కలర్ పొడర్స్‌నే టెంపెరా మీడియం కలుపుకొని చిత్రించడమే మంచిది. అవి త్వర త్వరగా ఆరిపోతాయి. రంగులు మడ్డిగా ఉండక ఫ్రెష్‌గా వుంటాయి. చూట్టానికి చిత్రం అందంగా కనబడుతుంది కూడా.

1×2 అడుగుల మేసనెట్ బోర్డు లేదా హార్డ్ బోర్డుని తీసుకుందాం. దాని చదును తలం వైపున తెల్లని వుడ్ ప్రైమర్ ను లేదా గెస్సోను అంగుళం వెడల్పు గల ఫ్లాట్ బ్రష్‌తొ కోటింగు యిందాం. దానిపై నునుపు కోసం గరుకైన ఇసుక పేపరుతో కాసేపు రుద్దాలి.

దానిపై ఒక రెమ్మను HB పెన్సిల్‌తో స్కెచ్ వేసుకుందాం. అందులొ చుట్టూ నాలుగైదు ఆకులు మధ్యలో రెండు పువ్వులూ వున్నాయి.

ఒక కోడిగ్రుడ్డు పగుల గొట్టి ఒక గ్లాసు లోకి పట్టి ఒక స్పూను తో కలుపుకొందాం. అందులో సగం డిస్టిల్స్ వాటర్ వేసి టెంపెరాను తయారు చేసుకొందాం.

ఇప్పుడు గ్రీన్ కలర్ పొడర్‌ను పింగాణీ డిష్‌లో (లేదా చిన్న పింగాణీ సాసర్‌లో ) ఒక స్పూనును వుంచుదాం. ఒక నెం. 5 సేబుల్ బ్రష్‌ను టెంపెరా మీడియంలో ముంచి ఆ బ్రష్‌ను రంగుపొడిలో రంగదీసి, తయారైన గ్రీన్ కలర్‌ని ఆకులకు అదే బ్రష్‌తో వేద్దాం. పువ్వులు వున్న ఏరియాను మినహాయించాలి సుమా.

అందులో గ్రీన్ వేయకూడదు. గ్రీన్ వేసేస్తే మరల పువ్వుల రంగు (గులాబి) ను ఆ గ్రీన్ మీద వేస్తే ఆ రెండూ కలసి కొత్త రంగు తయారవుతుంది. వాటర్ కలర్స్ లాగే ఇవి కూడా ట్రాన్స్పరెంటుగా వుంటాయి. గనుక వేరే కలర్స్ వేయవలసిన వాటిలోకి వేస్తున్న రంగును సోనీయ కూడదు.

అది వెంటనే ఆరిపోతుంది. దానిపై డార్క్ గ్రీన్‌తో నీడలు, లెమన్ యెల్లోతో హైలైట్ చిత్రించుకుంటే అకులు పూర్తవుతాయి. తరువాత పూవుల ఏరియాలో ఎరుపు తెలపులను కలిపిన గులాబి రంగును పూస్తాం. తరువాత దానిలో కూడా డార్క్కు కలర్, నీడలకు తెలుపులను. వెలుగులకు పూస్తాం.

వాటర్ కలర్స్ లాగా యీ రంగులుకూడా త్వర త్వరగా ఆరిపోతాయి. గనుక స్పీడ్‌గా వేయాలి.

తెల్లని వుడ్ ప్రైమర్ కోటింగ్ యిచ్చిన 1×1/2 అడుగుల హార్డ్ బోర్డును తీసుకొందాం. దానిపై ఒక మనిషి శరీరాన్ని (Nude) గాని ఒకని పోర్ట్రయిట్‌ని గాని HB పెన్సిల్‌తో స్కెచ్ వేసుకొందాం. టెంపేరాతో కలిపిన రంగులను ఆయా ఏరియాల్లో అయా ప్రత్యేక రంగులను వూద్దాం. శరీరానికి బ్రౌన్, గ్రౌండ్‌కు పసుపూ, దుస్తులకు ఎరుపూ వేశాం అనుకోండి. మరల ఆయా రంగులతో వెలుగు నీడలను చిత్రించుకుందాం. మొఖంపై కళ్ళు, ముక్కు, పెదవులు,తల, కనుబొమ్మలు వగైరాలను ఆయా రంగులతో పూర్తి చేద్దాం. కనుపాపలకు, కనుబొమ్మలకు, తలకు నలుపు కలిపిన బ్రౌన్‌ను వేద్దాం. కనుగుడ్లకు తెలుపు,పెదవులకు ఎరుపు పూద్దాం. ముక్కు చెవులు ప్రత్యేక రంగులు వేయనవసరం లేదు. వెలుగు నీడలతో చిత్రిస్తాం. దుస్తులలో ముడతలను వెలుగు నీడలలో చూపిస్తాం. దుస్తుల రంగు ఎరుపనుకోండి. నీడలు వేయవలసిన చోట ఆ ఎరుపుతోకాస్త వైలెట్ లేదా నీలం రంగు కలుపుకొని వచ్చిన డార్క్కు ఎరుపును చిత్రిస్తాం. హైలైట్స్‌వున్న చోట వైట్‌ను ఎరుపుతో కలిపి లేదా విడిగా అంటిస్తాం. బ్యాక్ గ్రౌండ్ కలర్ కూడా పూర్తిగా ఒకే రంగు వుంటే బాగోదు. ఫ్లాట్‌గా వుండిపోతుంది. కనుక అందులో గూడా లైట్, డార్క్కు షేడ్‌లు చూపించాలి.

ఈ విధంగా అనేక పెయింటింగ్‌లు చేయండి. అద్భుతాలను సృష్టించగలుగుతారు.

పోర్టరయిట్ పెయింటింగ్ అంటే మనిషి రూపాన్ని కనీసం మొఖాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రించడం. పూర్వం పొటోగ్రఫీ రాక ముందు దీనికి చాలా ప్రాముఖ్యత వుండేది. రాజులు, రాణులు, జమిందారులు,సేనాపతులు, ప్రముఖులు తమ చిత్రాలను చిత్రకారులచే వేయించుకొనేవారు.

మనిషిని ఎదురుగా కూచోబెట్టుకుని అతని స్వరూపాన్ని బాగా గీయడం గొప్ప విషయం. గీసేవాడికి గూడా తానొక సాహసం చేస్తున్నట్లుగా ఉత్సాహం వుంటుంది. ఇతరులూ అతని కృషిని అభినందిస్తారు. మెచ్చుకుంటారు. ఇలాంటి కళాకారుడికి అభిమానులు అనేక మంది యేర్పడతారు కూడా.

ఈ విధంగా పోర్ట్రయిట్‌లు గీయలేని వారు గీయవలసిన వ్యక్తి యొక్క ఫొటోగ్రాఫ్‌ను ఎదురుగా పెట్టుకొని గీస్తారు. అది కొంత సులువు. అదీ చేయలేని వారు అ ఫొటో మీద గళ్లు కొట్టుకొని, తన పేపరు మీద పెద్ద సైజు గళ్లుకొట్టుకొని ఒకొకగడిలో వున్న ఔట్‌లైనులను గీసుకుంటూ వేస్తారు. ఇది మరింత సులువు. ఇంకా కొందరయితే చిత్రించవలసిన వాని ఫొటోనెగిటివ్‌ని తన కాగిత మీదకు లేదా కేన్వాస్ మీదకు ఎక్స్‌పోజ్ చేసి దానిపై ఔట్ లైనును గీసుకొని దానిని కలరింగ్ చేస్తారు. అది అన్నింటి కంటే సులువు పద్ధతి. కానీ ఇవన్నీ విలువైన పనులు కాదు. మనిషిని కూచోబెట్టుకుని గీయడమే మంచి పద్ధతి. గొప్పకళ. సాధనచేయగా అది అలవడుతుంది కూడా.

ఈ పోర్టరయిట్ పెయింటింగ్ అనాదిగా వస్తునది. అన్ని దేశాలలోను అన్ని కాలాల్లోనూ ఈ రకం చిత్రకారులున్నారు. గోడల మీద, గుడ్డల మీద,చెక్కల మీద, కాగితాల మీద, తోలు మీదా ఈ పెయింటింగ్ వివిధ మీడియంలలో చేయబడ్డాయి. వీటిని ఆయిల్ కలర్స్‌తోను, వాటర్ కలర్స్‌తోనూ, పేస్టెల్స్‌తోనూ,క్రేయాన్స్‌తోనూ, ఆఖరికి చార్‌కోల్ తోనూ, పెన్సిల్‌తోనూ, ఇండియన్ ఇంక్‌తోనూ, చిత్రించడం చూస్తున్నాం. వివిధ కళాకారులు వివిధ మీడియంలలో వీటిని నైపుణ్యంగా చిత్రించగలరు.

మొత్తం మీద పోర్టరయిట్ పెయింటింగ్ అనే ఉత్సాహపూరితమైనవిద్య, ఈ చిత్రకారులు తమ చిత్రాలనూ అభిమానులనూ చిత్రించి వారి మన్నలను పొందుతారు. సాధారణంగా అందరు మెచ్చుకొనే విద్య ఇది.

ఎవరి పోర్టరయిట్ నయినా పెయింట్ చేయమని అర్డరులు రావచ్చు. వానికి ప్రతిఫలం కూడా ప్రోత్సాహకరంగానే వుంటుంది. చనిపోయిన వారి ఫొటోలను చిత్రించేవారు కూడా బాగానే సంపాదిస్తుంటారు.



**పోజింగ్**

మనిషిని ఎదురుగా కూచుండబెట్టుకుని ఈ చిత్రణను ప్రాక్టీసు చెయ్యాలి. సుమారు రెండు గజాల దూరంలో మనిషిని కూచోబెట్టుకోవాలి. మరీ దగ్గరగా గానీ, మరీ దూరంగా గానీ కూచుండబెట్టకూడదు. నిల్చున్నట్టుగానీ, కూచున్న పోజులో గానీ, ప్రక్కకు తిరిగి వున్నట్లుగానీ, ఎదురుగా వున్నట్లుగానీ - ఏదయినా మీ

ఇష్టమయిన పోజులోనే పెట్టవచ్చు. ఉత్తముఖం చిత్రమే అయితే అవి కూడా ఎదురుగా చూస్తున్నట్లు, ప్రక్కకు చూస్తున్నట్లో, పైకి చూస్తున్నట్లో, క్రిందకు చూస్తున్నట్లో,అతని ముఖాన్ని బట్టి, క్రాపుని బట్టి, అచ్చట వెలుగును బట్టి ఆ ఫోజును ఎంచుకోవాలి. అతని ముఖంపై కొంత వెలుగు, కొంత నీడ పడేటట్లు, చూడటం మంచిది. ముఖమంతా పూర్తిగా వెలుగుతో వున్నట్లుగానీ, పూర్తిగా నీడలో వున్నట్లుగానీ చిత్రించడం బాగుండదు. అవి ఫ్లాట్‌గా డల్‌గా వుంటుంది.

ఏ పోజులో కూచోబెట్టినా అతను త్వరగా అలసిపోకుండా వుండే పోజు మంచిది. మరీ బిగుసుకు పోకుండా వుండమనాలి. కనురెప్పలు మూయకూడదని అనకూడదు. అలా నిర్బంధిస్తే అతను ఎక్కువ సేపు ఒకే ఫోజులో వుండలేడు. అతనికి బోర్ కొట్టకుండా వుండటానికి అతనితో మాట్లాడుతూనే బొమ్మ గీసుకోవాలి.

ఈ విధంగా అతన్ని స్కెచ్ వేసుకున్నప్పుడు అదే పోజులో వుంచాలి. కలరింగ్ వేసేటప్పుడు కూడా అతన్ని ఉంచగలిగితే మంచిది.



మహాకవి శ్రీశ్రీని యీగ్రంథరచయిత పెయింట్ చేసినప్పటి చిత్రం

## స్కెచింగ్

కాగితం మీద గాని లేక కేన్వాస్ మీద గాని ముందు అతని చిత్రాన్ని డ్రాయింగ్ వేసుకుంటాం. ఆ పేపరుకు తగినట్లుగా అతని బొమ్మను అందులో అమర్చాలి. అది ఫుల్ ఫిగర్ (పూర్తి మనిషి) గానీ, బస్ట్ (శిరస్సు,మెడ, భుజములు, ఛాతీ) గానీ ఆ కాగితానికి తగినట్లు మరీ అంచును తాకునట్లుగాకుండా, మరీ చిన్నదీ గాకుండా స్కెచ్ వేసుకోవాలి.

మొదట అతని తలను, మెడను, భుజములను రఫ్‌గా, లైట్‌గా గీసుకుంటాం. ఆ తరువాత అతని శిరస్సులోని వివిధ భాగాలను విభజిస్తాం. "డ్రాయింగ్ నేర్చుకోండి" పుస్తకంలో శిరస్సు కొలతలు చదివే వుంటారు. వాటిని గుర్తు తెచ్చుకుంటూ కళ్ల రేఖను, ముక్కు రేఖనూ గీసుకొని వాటిపై ఆయా అవయవాలను గీస్తాం. శిరస్సు యొక్క సాధారణ కొలతను దృష్టిలో వుంచుకొని, మన ఎదురుగా వున్నతని అవయవాలను ఎంతెంత సైజులలో వున్నవో, ఎంతెంత దూరంలో వున్నవో పోల్చి చూసుకుంటూ గీయాలి. అప్పుడతని పోలికలను చిత్రించగలుగుతాము.

అలానే పూర్తి మనిషిని గీసేటప్పుడు గూడా తల నుండి పాదం వరకూ మొదట పై గీత, క్రింది గీత, ప్రక్క గీతలను గీసుకోవాలి. లేదా ఆభంగిమ యొక్క రిధమ్ గీతను గీసుకోవాలి. తరువాత ఆగీతలలోనే ఆ మనిషి కొలతను కూడా గీసుకోవాలి. భుజముల గీత, నడుము గీత, మొల గీత, కాళ్లు చేతులు వగైరాల గీతలను గీయాలి. మరల దానిని డీటైల్స్‌తో నింపాలి. ఇప్పుడు రంగులు వేయుటకు సిద్ధంగా వుందన్న మాట. ఈ సందర్భంగా "డ్రాయింగ్ నేర్చుకోండి" గ్రంథంలోని శరీరాల కొలతలను గమనికలో వుంచుకోవాలి. మనిషి 8 శిరస్సుల పొడవు వుంటుందని అందులో చెప్పబడింది. ఆ బొమ్మ మీద వెలుగు నీడలనుకూడా పెన్సిల్‌రేఖలతో నోట్ చేసుకోవాలి.







ఈ విధంగా స్కెచింగ్ ని పూర్తి చేస్తాం. స్కెచింగ్‌ని ఎప్పుడూ లైట్ పెన్సిల్‌తో అంటే HB లేక H పెన్సిల్‌తోనే గీయాలి. నీటి రంగులు వేశాక పెన్సిల్ గీతలు కనబడకుండా వుండాలంటే అవి నల్లగా వుండకూడదు. ఆయిల్ కలర్స్ అయితే పరవాలేదు. అవి పెన్సిల్ స్కెచ్‌ని గానీ, చార్ కోల్ స్కెచ్‌ని గానీ కప్పివేయగలవు. ఎందుకయినా మంచిది. స్కెచ్‌ని ఎప్పుడూ లైట్ గీతలతోనే వేసుకోవాలి.

పెన్సిల్ గీతలను మరీ మరీ గీసి రబ్బరుతో మళ్లా మళ్లా చెరిపి కాగితాన్ని ఖరాబు చెయ్యకూడదు. ఆటువంటి చోటు నీటి రంగులను పీల్చుకొని మరకలు చేస్తుంది.

వాటర్ కలర్స్‌కయితే వాట్ మన్ పేపరు, అయిల్ కలర్స్ కయితే ఆయిల్ స్కెచింగ్ పేపరు లేదా కేన్వాస్ వాడాలని గుర్తుంది. కదూ. ఇక రంగులు వేద్దాం.

## రంగులు వేయడం

ఇలాంటి పోర్ట్రయిట్ పెయింటింగ్ కోసం ప్రధానంగా మూడు నాలుగు రంగులను తయారు చేసుకోవాల్సి వుంటుంది. చర్మం రంగు, తల వెంట్రుకల రంగు, దుస్తుల రంగులను చేసుకోవాలి. కళ్ళు, పళ్ళ రంగు, ఆభరణాల రంగు బూటు, కళ్ల జోడు మొదలగువాటి రంగులూ చేసుకోవలసి రావచ్చు.

ఈ విధంగా ఆయా రంగులను తయారు చేసుకొనడమే గాక వాటి నీడ రంగులను కూడా తయారు చెయ్యాలి. చర్మం రంగుందనుకోండి. తెల్లని మనిషిదయితే తెలుపు, పసుపు, ఎరుపుల కలయికతో తయారు చేయ్యవచ్చు. వాటిని వివిధ పాళ్లలో కలిపి చూడండి. అతని రంగు తయారవుతుంది. నల్లని వాడయితే ఎరుపు, పసుపు, నీలం లను కలిపి చూడండి. వివిధ పాళ్లలో కలిపితే వివిధషేడ్‌లలో వస్తుంది. అందులో మనకు తగిన షేడ్ దొరక వచ్చు. అంతే గాని చర్మానికి ఏరంగూ సింగిల్‌గా పనికి రాదు.

అలాగే చర్మం రంగుకి నీడ రంగు కూడా కావాలి. ఇందుకోసం ఎరుపు, నీలం లను గాని ఎరుపు, పచ్చలను గాని (Rose Madder, Viridian Green) కలపండి. ఒక రకం వైలెట్ తయారవుతుంది. నీడరంగంటే ఇదే. దీనిని ఇందాక తయారుచేసిన చర్మం రంగుతో కలిపితే చర్మం యొక్క నీడ రంగు తయారవుతుంది.

ఇందాకటి చర్మం రంగు వెలుగు వైపున్న చర్మానికి ఇప్పటి చర్మ నీడ రంగు నీడలో వున్న చర్మానికీ వేయాలి. ఆ రెండూ తాకే సరిహద్దులలో వుత్త బ్రష్‌తో రాస్తే అవిరెడూ చక్కగా బ్లెండ్ అవుతాయి. వెలుగు నీడల మధ్య కచ్చిత మైన సరిహద్దులే వుండకుండా వెలుగు నుండి నీడకు టోన్ మారినట్లు వుండాలిగా మరి.

అలాగే వెలుగు లో వున్న చర్మం పై మెరుపులు (High LIghts) వున్న చోట్ల తెలుపు మచ్చలు అంటించాలి. అపుడది మెరుస్తున్న చర్మంలాగా వుంటుంది.

అలాగే తలకు గూడా రంగు తయారు చేసుకోవాలి. బ్రౌన్, నీలం మొదలగు చిక్కని రంగులను రెంటిని కలుపుకొని ఒక రకం నల్లని రంగును చేసుకోవాలి. వెలుగులో వున్న తలరంగుకు అది పూయవచ్చు. నీడలో వున్న తలకు బాక్స్‌లో వున్న నలుపును వాడవచ్చు. మెరుపులకు మొదటి రంగు మీద తెలుపును

అంటించవచ్చు. అలానే డ్రెస్‌ల రంగులను, వాటి నీడ రంగులనూ తయారు చేసుకోవాలి. నీడలకు నలుపును వాడితే బాగోదు. ఇందాక చెప్పినట్లు ఎరుపు, పచ్చలను కలిపి ఒకరకం వైలెట్‌ను తయారు చేసుకుంటే అది నీడ రంగుగా పనికి వస్తుంది.

**బ్యాక్ గ్రౌండ్ కలర్**

ఇక బ్యాగ్ గ్రౌండ్ గురించి చూద్దాం. పోర్ట్రయిట్ బొమ్మలన్నింటికీ సాధారణంగా బ్యాక్ గ్రౌండ్ కలర్ వేస్తాం. బ్యాక్ గ్రౌండ్ కోసం సాధారణంగా ప్రకాశవంతమైన రంగులను వాడరు. ఎందుకంటే బొమ్మే ప్రకాశవంతంగా వుండాలి. గాని బ్యాక్ గ్రౌండ్ కాదు. అందుకనే డల్ కలర్స్‌లనే వాడతారు. ప్రాథమిక రంగులను గానీ, ద్వితీయ రంగులను గానీ వాడకూడదు. ద్వితీయ రంగులు కలిపితే వచ్చే మడ్డి రంగులే ఇందుకు పనికి వస్తాయి.

ఏదో ఒక రంగునుతయారుచేసుకొని బ్యాక్ గ్రౌండ్ కు వాడతాం. బ్యాక్ గ్రౌండ్ ఫ్లాట్‌గా ఒకే టోన్‌లో కనిపిస్తుంది కదూ. అలా కనిపించకుండా వుండడానికి ఒక వుపాయం వుంది. తల, నల్లని చర్మం మొదలగు నల్లని రంగుల ప్రక్కనే వచ్చే బ్యాక్ గ్రౌండ్ కలర్‌తో కాస్త తెల్లరంగును, బట్టలు, తెల్లని చర్మము ప్రక్కన కాస్త నీలి రంగు లేదా మరే దన్నా చీకటి రంగును కలిపి వాడుతాం. ఇలా చేసినందు వల్ల బ్యాక్ గ్రౌండ్ కలర్ ఫ్లాటుగా ఒకే టోన్‌లో వుండకుండా కలర్ బ్లెండింగ్‌తో నేచురల్‌గా వుంటుంది.

బ్యాక్ గ్రౌండ్ కలర్ వేసేటప్పుడు చర్మంరంగుకు గానీ, దుస్తుల రంగుకు, అంటే ఫోర్ గ్రౌండ్‌లోని రంగులకు ఆపోజిట్ కలర్‌లో వుండే డల్ కలర్‌నే యెంచుకోవచ్చు. లేదా ఫోర్ గ్రౌండ్ లోని కలర్స్‌తో మేచ్ అయ్యే దగ్గర కలర్‌నే డల్‌గా వుండే దానిని యెంచుకోవచ్చు.

# క్యాలెండర్ పెయింటింగ్

# CALENDER PAINTING

ప్రతి యింట్లోనూ గోడల మీద అందమైన క్యాలండర్లు వేలాడుతుంటాయి. చాలా సంస్థల వారు, దుకాణాలవారు, పరిశ్రమలవారూ వారి వారి వినిమయదార్లకు ఉచితంగా పంచి పెడుతుంటారు క్యాలెండర్‌లను. సాధారణంగా సంవత్సరం మొదటి రోజు సందర్భంగా వాటిని పంచుతారు.

కాలెండరులో ప్రధానంగా మూడు అంశాలుంటాయి. ఒకటి - ఆకర్షణీయమైన చిత్రం. రెండు - 12 నెలల వివరాలు. మూడు - క్యాలెండరును ప్రచురించిన సంస్థ పేరు (లోగో).

క్యాలెండరులోని అందమైన చిత్రం మన యింటిలోని గొడలకు అలంకరణగా వుపకరిస్తుంది. క్యాలెండరులోని అంకెలు (నెలలు-రోజులు-వారాలు) కూడా మనకు అప్పుడప్పుడు అవసరమవుతుంటాయి.

క్యాలెండరు మీదనున్న సంస్థ పేరు (లోగో) ఆ సంస్థ వారికి అడ్వర్టయిజ్ మెంట్‌లా పనిచేస్తుంది. అది ప్రతి యింటి గోడల మీద వుండి అందరికీ తెలుస్తూంటుంది. ఆ మేరకు వారి కది ప్రచారమే కదా.

క్యాలెండరును ఎవరయినా చూస్తేనే కదా వారికి ప్రచారం జరిగేది. క్యాలండరు మీద మంచి అందమయిన చిత్రం వుంటేనే యెవరయినా దాన్ని చూస్తారు మరి.

అందుకనే అందమయిన చిత్రాలకు పూర్వం గిరాకీ యెక్కువగా వుండేది. ప్రఖ్యాత చిత్రాకారుడు రవివర్మ చిత్రాలుక్యాలెండర్లుగా ప్రింటయి ఇండియా అంతా వ్యాప్తి చెందాయి. ఆ తరువాత కూడా అదే తీరులో దేవతల గాధలు చిత్రించిన అనేక మంది చిత్రకారుల పెయింటింగ్‌లు క్యాలెండర్లుగా ప్రచురితమయ్యాయి. కృష్ణుడు, రాముడు,శివుడు, ఆంజనేయస్వామి, వినాయకుడు,లక్ష్మి, ఏసుక్రీస్తు, మరియమ్మ, బుద్ధుడూ లాంటివి యెన్నో మన గోడల్ని అలంకరించాయి. భారత, భాగవత, రామాయణ పురాణ గాధలూ, బైబిల్ కధలూ కూడా క్యాలెండర్‌లలో అందంగా చిత్రించ బడ్డాయి.

స్వాతంత్ర్యోద్యమ కాలంలోమన దేశ నాయకుల చిత్రాలు కూడా ప్రచురిచబడేవి. బాపూజీ, నేతాజీ, నెహ్రూజీ, భగత్సింగ్, అల్లూరి సీతారామ రాజు లాంటి చిత్రాలు క్యాలండర్లుగా వెలువడి ప్రజలచే బాగా ఆకర్షించబడ్డాయి.

ఈ రోజులలో అయితే క్యాలండర్లలో సినీ తారల, నటుల చిత్రాలను ప్రజలు అభిమానిస్తున్నారు.

ప్రఖ్యాత క్రీడాకారుల బొమ్మలు కూడా ప్రజలు అభిమానానికి నోచుకుంటున్నాయి.

ఇక ఎల్లప్పుడూ ఆకర్షించేవి కొన్ని వుంటాయి. అవే అందమయిన ప్రకృతి దృశ్యాలు. వివిధ పక్షులు, జంతువులు,పూవులు, రెమ్మలు, కొమ్మలు, సీనరీలూ (లాండ్ స్కేప్‌లు,సీస్కేప్‌లు), సీతాకోక చిలుకలు, నదులూ, కొండలూ, కోనలూ గోడల మీద ఆహ్లాదాన్నిస్తాయి.

అత్యంత ఆకర్షణీయమైనది మానవ శరీరం. దిగంబరంగానో, అర్థ దిగంబరంగానో మానవ శరీరం, ప్రత్యేకంగా స్త్రీ శరీరం ప్రచురించడం వాడుకలో వుంది. వీటిని చాలా మంది లైక్ చేస్తారు. ఉత్త దిగంబర స్త్రీ అయితే లైక్ చేస్తారు గాని గోడల మీద పెట్టుకోడానికి మొహమాట పడతారు.

అందుకనే మన చిత్రకారులు ఏ దేవతనో,రాణి ప్రేమ పురాణాన్నో, ఏ గిరిజన యువతినో చిత్రిస్తుంటారు. అలాంటి వార్ని అర్థ నగ్నంగా చిత్రించవచ్చు. వారు అలానే వుంటారు కదా మరి. ఆధునిక కాలంలో ఇలాంటివి ఎన్నో చిత్రించారు బొంబాయి చిత్రకారులు.

ఈ రోజులలో ఆఫ్‌సెట్ కలర్ ప్రింటింగ్ బాగా వాడుకలోకి వచ్చింది. తమిళ నాడులోని శివకాశి క్యాలండర్ ప్రింటింగ్‌కు కేంద్రం. ఏ మీడియంలో వున్న బొమ్మనయినా సునాయాసంగా చిత్రాకారుడు చిత్రించిన ఒరిజినల్ లాగా కనిపించేట్లుగా రంగులలో ప్రింటు చేయగలుగుతున్నారు.

కనుక చిత్రకారులు ఏమీడియంలోనయినా - పెన్సిల్ డ్రాయింగ్, ఇంక్ డ్రాయింగ్, వాష్ డ్రాయింగ్, పోస్టరు కలర్స్, ఆయిల్ కలర్స్, వాటర్ కలర్స్, ఆయిల్ పేస్టల్స్ మొదలైన మీడియంలలో పబ్లిషర్ కోరిన చిత్రాన్ని చిత్రించవచ్చు. ఏ సైజు బొమ్మ కావాలో కూడా సాధారణంగా పబ్లిషర్‌లు చెబుతారు.

కొందరు పబ్లిషర్లు చిత్రాకారులకు ఆర్డర్లు యివ్వకుండా చిత్రకళా ప్రదర్శనలలో బాగా కనిపించిన చిత్రాన్ని కొనుక్కొని క్యాలండరుగా ప్రచురించుకుంటారు.

కొందరు పబ్లిషర్‌లు చిత్రకారుని పెయింటింగ్ ఖర్చును తప్పించుకోడానికి అందమయిన రంగుల ఫోటోను యెంచుకుంటారు. సినిమా యాక్టర్లవి, క్రీడాకారులవీ సాధారణంగా కలర్ ఫోటోలనే చిత్రిస్తుంటారు.

అయినప్పటికీ మంచి చిత్రకారులకు అందంగా చిత్రాలు వేసే వారికి చేతి నిండా పని వుంటూనే వుంటుంది.

ప్రముఖ పట్టణాలలో వున్న క్యాలెండర్ పబ్లిషర్లు వారికి అందుబాటులో వున్న ప్రముఖ చిత్రకారులతో బొమ్మలు గీయించుకొని ప్రచురిస్తుంటారు. చిత్రారులకు ప్రతిఫలం (రెమ్యునరేషన్ ఎమౌంట్) బాగానే ముట్ట చెబుతారు.

క్యాలెండర్ ఆర్టిస్టుగా గుర్తింపు రావాలంటే అందమైన చిత్రాలు వేయడంలో సిద్ధహస్తుడవ్వాలి. వీలయితే అన్ని మీడియంలలోనూ, కనీసం ఏ ఒక్క మీడియంలోనైనా స్పెషలిస్టు అనిపించుకోవాలి.

అన్ని సబ్జెక్టులలోనూ ఆరితేరాలి. ప్రకృతి దృశ్యాలూ, మానవ శరీరాలూ, అందమైన ప్రాణులూ, పురాణాల గాథలూ ఏదయినా చిత్రించాలి. కనీసం తన కిష్టమైన ఏదో ఒక సబ్జెక్టులో ఆరితేరాలి.

అందమైన పెయింటింగ్‌లు వేసి మన టౌన్‌లలోనూ, సిటీ లలోనూ, జరిగే ఎగ్జిబిషన్‌లలో పాల్గొనాలి. అప్పుడే పబ్లిషర్‌ల దృష్టిలో మన టాలెంటు పడుతుంది. క్యాలెండరు ఆర్టిస్టు అవడానికి అవకాశాలుంటాయి.

# గ్రీటింగ్ కార్డులు
# GREETING CARDS

ప్రతి యేడూ నూతన సంవత్సరం సందర్భంగా మిత్రులకు, బంధువులకు, పరిచయస్తులకు, సహచరులకు గ్రీటింగ్ కార్డులను పంపించుకోవడం లేదా అందజెయ్యడం ఆధునిక నాగరికతా చిహ్నం. ఇంచు మించు చదువుకున్న వారంతా ఇలా చేస్తుంటారు. విధ్యార్ధులు అత్యంత ఉత్సాహంతో ఈ సాంప్రదాయాన్ని ఆచరిస్తుంటారు.

ఇవి గ్రీటింగ్ కార్డులమ్మే షాపులలో లభిస్తాయి. వాటిలో కొన్ని ఫొటోగ్రాఫ్‌లవి, కొన్ని పెయింట్ చేయబడినవి వుంటాయి.కొన్ని రంగులవి కొన్ని తెలుపు నలుపువి వుంటాయి.

పెయింటింగ్ చేయబడిన గ్రీటింగ్ కార్డులు కూడా కొన్ని హేండ్ మేడ్‌వి, కొన్ని ప్రింటెడ్‌వి వుంటాయి. హేండ్ మేడ్ గ్రీటింగ్ కార్డులంటే డైరెక్టుగా ఆర్టిస్టు చిత్రించినవి అమ్మబడతాయి. ప్రింటెడ్‌వి అంటే ఆర్టిస్టులు చిత్రించిన దాన్ని లక్షల కాపీలలో ప్రింటు చేసి వాటిని అమ్ముతారన్నమాట. ఈ రకంవే ఎక్కువగా వుంటుంటాయి. ఈ రెండు రకాలవీ ఆర్టిస్టులు వేసినవే.

## హేండ్‌మేడ్ గ్రీటింగ్ కార్డులు

ఐవరీ బోర్డు, స్నోవైట్ బోర్డులు లేదా తెల్లని కార్డు బోర్డులు కొనుక్కొని గ్రీటింగ్ కార్డు సైజులో ముక్కలు చేసుకుని వాటి మీద చిత్రించవచ్చును. గ్రీటింగ్ కార్డులలో సింగిల్ కార్డు ఫోల్డర్ మొదలైన రకాలు వివిధ సైజుల్లో వుంటాయి. సింగిల్ కార్డులు వెనుక వైపు అడ్రస్, స్టాంప్ వేసి డైరెక్టుగా పోస్ట్ చేసెయ్యోచ్చు. అలా చేస్తే అది పోస్ట్ కార్డు సైజులోనే వుండాలి. కార్డులను కవలరులో పెట్టి బుక్ పోస్టులాగా కూడా పంపవచ్చు. ఫోల్డరు అయితే కవరులు తప్పనిసరిగా వుండాల్సిందే.

బొమ్మలేని ఖాళీ (Empty) కార్డులు కూడా హోల్ సేల్ దుకాణాల్లో లభిస్తాయి. అక్షరాలు మటుకే ప్రింటయ్యి ఉంటాయి. అక్షరాలు అంటే Wish you Happy New Year వగైరా, చిత్రం మాత్రం ఉండదు. చిత్రం కోసం ఒక వైపు ఖాళీ వుంటుంది. దానిపై డైరెక్ట్‌గా మనం చిత్రించుకోవచ్చు. లేదా మన చిత్రాన్ని మనకు నచ్చిన కాగితంపై చిత్రించి దాన్ని ఆ ఖాళీలో అంటించవచ్చు. అమ్మకానికైతే ఇలాగే ఎంప్టీ కార్డులను కొని వాటిపై చిత్రించడం లేదా చిత్రాలను అంటించడం మంచిది.

స్వంతవాడకానికయితే కార్డు ఫోల్డర్‌ను మనమే తయారు చేసుకొని ఒక పేజీలో చిత్రం, ఒక పేజీలో అక్షరాలు వ్రాసుకోవచ్చు.

ఇలాంటి కార్డులపై చిత్రించబడిన గ్రీటింగ్ కార్డులను గ్రీటింగ్ కార్డులు అమ్మే షాపుల వారికి హోల్ సేల్ రేటుకి వేయవచ్చు. వారు వాటిని చిల్లరగా ఇంకాస్త ఎక్కువ రేటుకిఅమ్ముకుంటారు. వాటి రేట్లు వాటి పనితన్నాన్ని బట్టి, మీడియంని బట్టి, అది తయారుచేయడానికి పట్టిన కాలాన్నా బట్టి మారుతూ వుంటాయి.

ఈవిధంగా ప్రతియేడూ చివరి నెలల్లో తీరిక వేళల్లో కొన్నివందల గ్రీటింగ్ కార్డులను తయారు చేసుకుని కొట్లకు వేయడం ఒక జీవన భృతి ఇలా కొందరు ఆర్టిస్టులు చేస్తుంటారు.

కాస్త పెట్టుబడి వున్న ఆర్టిస్టులు తమ చిత్రాలను వేల సంఖ్యలో ప్రింటింగ్‌చేయించి కొట్లకు వేయవచ్చు. ఇదయితే లాభ సాటి వ్యాపారం.

ఇలా అమ్ముకోడానికి వేయబడే గ్రీటింగ్ కార్డులు కాస్త అందంగా ఆకర్షణంగా వుండాలి. లేకపోతే ఎవరూ కొనరు.






## గ్రీటింగ్ కార్డులను చిత్రించడం

ఈ గ్రీటింగ్ కార్డుల చిత్రాలు వేయడానికి అందమైన సబ్జెక్టును, ఆకర్షణీయమైన మీడియంనూ ఎంచుకోవాలి. అందమయిన ప్రకృతి దృశ్యాన్నో, పక్షుల జంటనో, జంతువుల జంటనో, సీతాకోక చిలుకలనో, పువ్వులు, రెమ్మలూ, కొమ్మలనో,అందమై మనుష్యుల జంటలనో,డాన్సు భంగిమలను ఇలా ముచ్చటగా వుండి ముద్దొస్తున్న విషయాలను ఎంచుకోవాలి.

ఆ సబ్జెక్టుకు తగిన మీడియంని ఎంచుకోవాలి. ఏ మీడియం నయినా వాడొచ్చు. ఇండియన్ ఇంకు గాని, రంగుల ఇండియన్ ఇంకులు గానీ, పెన్సిల్ మీడియంగానీ, రంగు పెన్సిళ్ల గానీ, వేక్స్ క్రేయాన్‌లుగానీ, ఆయిల్ పాస్టెల్సు గానీ, వాటర్ కలర్స్‌గానీ, ఫోటో కలర్స్ గానీ, పోస్టర్ కలర్స్ గానీ, ఆయిల్ కలర్స్ గానీ, ఏ మీడియంలో నయినా చేయవచ్చు.

ఆయిల్ పెయింటింగ్ కయితే ఎక్కువ టైమ్ తీసుకొంటుదని మీకు తెలుసు. కష్టానికి తగిన ఫలితం (ఆదాయం) రాదు కూడా. కనుక దాన్ని ఎవరూ చేయరు. ఎక్కువ మంది పోస్టర్ కలర్స్‌నే ఎంచుకుంటారు.

షాపులో కనిపించే హేండ్‌మేడ్ గ్రీటింగ్ కార్డులను పరిశీలించి సరికొత్త సబ్జెక్టులను, తగిన మీడియంలనూ ఎంచుకోండి.

### అక్షరాలు :

మనం తయారు చేసే గ్రీటింగ్ కార్డులపై అక్షరాలు రాయవలసి వస్తే, తగిన సైజులో, అందముగా స్పష్టముగా వుండే విధంగా రాయాలి. శుభాకాంక్షలను విడివిడి పదాలలో తయారు చేయాలి. వాడుకలోవున్న పదాలనూ గమనించి వాడొచ్చు. కొత్త పదాలను మీరే సృష్టించి వాడొచ్చు . అయితే అవి సందర్భానికి తగినట్లుండాలి.

### అతికింపుల గ్రీటింగ్ కార్డులు

రంగు రంగుల కాగితాలను వివిధ షేపులలో **కత్తిరించి** వానిని గ్రీటింగుకార్డుల మీద అతికించితే ముచ్చటగా వుంటుంది. వీటిని అతికింపులతో చేయబడినవి అంటారు. నీలపు పేపరు మీద పసుపు పచ్చని బిళ్ళ అతికిస్తే ఆకాశంతో సూర్యుడులా వుండదూ. దాని క్రింద బ్రౌన్ కలర్ పడవ,తెల్లని తెరచాపా కత్తిరించి అతికితే ఎంత బాగుంటాయి.

ఇంకో ఉదాహరణ చూడండి. లేత నీలపు రోడ్ మీద ఎర్రని బస్‌ని, నల్లని కాండము గల ఆకు పచ్చ ఆకుల తాడిచెట్టుని కత్తిరించి అతికించామనుకోండి. ఎంత బాగుంటుంది. ఇలాంటి అతికింపుల గ్రీటింగ్ కార్డులు పిల్లలకు బాగా నచ్చుతాయి.

## ఆకులపై గ్రీటింగ్ కార్డులు

మరో రకం గ్రీటింగ్ కార్డులు కూడా అప్పుడప్పుడు కనిసిస్తుంటాయి. పచ్చదనం తీసివేయబడిన ఆకుల మీద బొమ్మలు చిత్రించడం.సాధారణంగా ముదురు రావి ఆకుల్ని ఇలా ఉపయోగిస్తారు. ముందు ఆకుల్ని

పది రోజుల పాటు నీటిలో నానబెడ్తారు. ఆకు యొక్క పచ్చని పదార్థం అంతా కుళ్ళి రాలిపోతుంది. ఈనెల సముదాయం మాత్రమే మిగులుతుంది. ఆ ఈనెలతో వున్న ఆకుల్ని ఎండబెట్టాలి. వాటిపై పోస్టర్ కలర్స్‌తో గానీ, ఆయిల్ కలర్స్‌తోగాని చిత్రాలు వేయవచ్చు. ఆ చిత్రించబడిన ఆకును ఫెవికాల్‌తో నల్లని గ్రీటింగ్ కార్డుమీద అతికించవచ్చు. ఇవి వింతగా, ఆకర్షణంగా వుంటాయి.

వీటిని చేయడానికి శ్రమ ఎక్కవ గనుక ఇవి కాస్త ఖరీదుకు అమ్మబడుతుంటాయి,

మీరు బాగా చిత్రించి అభివృద్ధి అయి పెద్ద చిత్రాకారులయితే గ్రీటింగ్ కార్డులను ప్రింటు చేసే పబ్లిషర్లు కూడా మీ చిత్రాలను కొనుక్కుని లక్షల సంఖ్యలలో ప్రింటు చేయించుకుని అమ్ముకుంటారు.

గ్రీటింగ్ కార్డులకు పనికి వచ్చే అందమైన చిత్రాలను కొన్నింటిని వేసి ఒక ఆల్బంగా తయారుచేసి అలాంటి పబ్లిషర్‌లకు చూపించాలి. అందులోని చిత్రాలు వారికి నచ్చితే అవి తీసుకొని మనకు తగిన ప్రతిఫలం (Remuneration) యిస్తారు.

## గ్రీటింగ్ కార్డుల ప్రింటింగ్

ఇలా ప్రింటింగ్ కోసం గ్రీటింగ్ కార్డులు చిత్రించే వారు దృష్టిలో వుంచుకోవలసిందొకటుంది.

గ్రీటింగ్ కార్డులను ప్రింటుచేసే విధానాలు కొన్ని వున్నాయి.అవి మూడు రకాల ప్రెస్‌లు, ఒకటి లెటర్ ప్రెస్, రెండు ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్ , మూడు స్క్రీన్ ప్రింటింగ్.

లెటర్ ప్రెస్‌లో ప్రింట్ చేయాలన్నా, స్క్రీన్ ప్రింటింగ్ లో ప్రింట్ చెయ్యాలన్నా నల్లని ఇండియన్ ఇంక్‌తో చిత్రించి యివ్వాలి. అందులోను ఏ ఏరియా ఏరంగు పడాలో సూచించే కలర్ సజిషన్ యివ్వాలి. ఇందుకోసం ఆ ఇండియన్ ఇంక్ డ్రాయింగ్ మీద రంగులు వేయకూడదు. పైన అదనంగా ఒక పలుచని పేపరు (బటర్ పేపర్ లేక ఆయిల్ పేపర్ లేక ట్రేసింగ్ పేపర్ వాడవచ్చు) ను అటించి దానిమీద ఆయా రంగులను రఫ్‌గా పూయవచ్చు. ఆ పలుచని పేపరును డ్రాయింగ్ పై అంచున అంటిస్తాం. డ్రాయింగ్ మీద పడి వున్నప్పుడు ఏయే ఏరియాలో ఏ రంగులలో ప్రింటవ్వాలో సు చిస్తూ రంగులు వేస్తారు.

అభినంధన వారి గ్రీటింగ్ కార్డులు యిలాగే తయారవుతాయి. బాపు, బాలి, చంద్ర మొదలగు వారు చిత్రించిన చిత్రాల్ని వారు ప్రింటు చేస్తున్నారు.

ఇక ఆఫ్ సెట్‌లో ప్రింటయ్యే గ్రీటింగ్ కార్డులకు మనం చక్కగా రంగుల్లో చిత్రించిన పెయింటింగ్‌లనే యిచ్చేయెచ్చు. వారు వాటినే రంగులలోప్రింటు చెయ్యగలరు. అవి ఎంతో బాగుంటాయి. ఇలాంటివి పెద్ద పట్టణాలో ప్రింటవుతాయి. కనుక పట్టణాలలోని ఆర్టిస్టులే వారికి అందుబాటులో వుంటారు.

ఈ రంగుల చిత్రాలనుపోస్టర్ కలర్స్‌తో గాని, ఆయిల్ కలర్స్‌తో గాని, వాటర్ కలర్స్‌తో గాని, రంగుల ఇండియన్ ఇంక్‌లతో గాని, క్రేయిన్స్‌తో గాని,పేస్టెల్స్‌తో గాని చిత్రించవచ్చు. ఆయా మీడియంలకు తగిన పేపరు ఎంచుకొని ఆ పేపర్ల మీద చిత్రించి పబ్లిషర్ లకు చూపించే ఆల్బంలో వాటిని అంటించాలి.

వాడుకలో వున్న గ్రీటింగ్ కార్డుల సైజులు, రీతులను మనం ఎప్పటికప్పుడు పరిశీలిస్తూండాలి. గ్రీటింగ్ కార్డ్‌ల కొట్ల వద్ద గమనిస్తూ కొత్త కొత్త సబ్జెక్టులను ఎన్నుకొని చిత్రించాలి.

# STILL LIFE

జీవం లేని, చలనం లేని వస్తు సముదాయాన్ని చిత్రిచడాన్ని "స్టిల్ లైఫ్ పెయింటింగ్" అంటారు. ఎదురుగా ఒక టేబుల్ మీద (లేక నేల మీద) కొన్ని వస్తువులను పెట్టుకుని చిత్రిచడమే ఈ ప్రక్రియ. వీటిని వాటర్ కలర్స్‌తో గాని, పేస్టెల్ కలర్స్ తోగాని యే మీడియంలో నయినా చిత్రించవచ్చు. ఇందుకు గాను ఫలములనో, పాత్రలనో,లేక మరే వస్తువుల్ననయినా వుంచవచ్చు.

పెద్ద పెద్ద ఆర్టిస్టులు కూడా మొదట ఈ విధంగానే స్టిల్ లైఫ్ చిత్రాలను ప్రాక్టీసు చేసినవారే. ఎందుకంటే యివి కదలకుండా ఎంతసేపయినా మనముందు పడి వుంటాయి. వాటి మీద వుండే వెలుగునీడలు కూడా అంతగా మారవు. ఏ కాకులనో, మేకలనో, మేఘాలనో గీయలంటే అవి కదలకుండా వుంటాయా? ఒక ప్రకృతి దృశ్యాన్ని గీయాలన్నా, అందునోని వెలుగు నీడలు మనం గీసే లోపలఅనేక మార్పులకు గురవుతాయి. కదులుతున్న సూర్యుని ఎండ వలన వాటి నీడలు మారి పోతుంటాయి.

ఎలాంటి వస్తువులను స్టిల్ లైఫ్ వేయాలో చూద్దాం. అన్నీ గ్లాసులు గానీ, అన్నీ పళ్ళు గానీ, అన్నీ బూట్లు గానీ, అన్ని పుస్తకాలు గాని మనముందుంచుకొని గీయనవసరం లేదు. రకరకాల వస్తువులను సేకరిలంచుకుంటేనే అందం. వివిధ రంగులవి, వివిధ సైజులవి,వివిధ రూపాలవి, వివిధ తలములవి (అంటే నున్ననివి, గరుకువి,బొడుపులవి, గంటులవి మొదలైనవి) అయిన రకరకాల వస్తువులను ఆ సముదాయంలో వుంచుతాం.

మామిడి కాయ, మిరప కాయ, ఆకు, పచ్చని గ్లాసు మొదలైనవి అన్నీ ఒకే రంగువి వుండేవి చిత్రించినా బాగోదు. ఒకటి ఎర్రనిది.ఒకరటి పచ్చనిది మరొకటి తెల్లనిది. అలా వివిధ రంగులవి ఎంచుకుంటాం. అలాగే అన్నీ ఒకే సైజులో వున్న వస్తువులను పెట్టబడినా బాగుండదు. ఒకేరూపంలో వుండేవి పేర్చినా బాడుండదు. బంతి, బత్తాకాయ,గుడ్డు మొదలైన గుండ్రని వస్తువులు - అన్నీ ఒకే లాగున్నవి చిత్రిస్తే ఏ బాగుంటుంది. ఒకటి గుండ్రంది. మరొకటి స్థూపాకారం గలది, ఇంకొకటి వలకలు పలకలుగా వుండే ఘనాకారం లాంటిది పేర్చితే ఇంటరెస్టింగ్ గా వుంటాయి. అలాగే అన్నీ చదునుగా వుండేవి గాని, అన్ని నిగనిగ లాడేవి గాని, అన్నీ గంట్లు గంట్లు గా వుండేవి గానీ అమర్చినా బొమ్మ డల్‌గా వుంటుంది. కనుక రకానికొకటి ఎంచుకోవాలి.

కాబట్టి వైవిధ్యం (వెరైటీ) వున్నటు వంటి వస్తు నముదాయాన్నే స్టిల్ లైఫ్‌గా చిత్రించడానికి యెంచుకుంటాం.

వాటిని ఎలా పేర్చుకోవాలి? అన్నిటినీ వరుసగా నిలబెట్టినా, లేక వరుసగా బోర్లించినా, లేక పరుండబెట్టినా చిత్రం డల్ గా వుంటుంది. అవి చిందర వందరగా పడివున్నట్లు చిత్రిస్తేనే నేచురల్‌గా వుంటుంది. ఒక దాని ప్రక్క ఒకటి ఒకదాని వెనక ఒకటి, ఒకదాని మీద ఒకటి చిందర వందరగా పడిఉన్నట్లు పేర్చాలి.

అలాగని వస్తువులు విడివిడిగా, దూరదూరంగా పడి వుండ నియ్య కూడదు. ఆ వస్తువలన్నీ కలసి కట్టుగా వున్నట్లు దగ్గరగానే పేర్చాలి. ఇలా వుంటే స్టిల్ లైఫ్‌లోని వస్తువులన్నీ యూనిటీలో ఉన్నాయని, అంటాం. అంటే ఐక్యంగా ఉండి ప్రేక్షకుని దృష్టికి శ్రమ లేకుండా ఆహ్లాదంగా ఉంటాయి.

ఆ విధమైన వస్తువులని సేకరించి, ఈ విధంగా మనముందు పేర్చుకున్న తరువాత ఒక కాగితం మీద బొమ్మ గీయాలి. HB డ్రాయింగ్ పెన్సిల్‌తో లైట్‌గా వేసుకోవాలి.

నాలుగైదు చిన్న కాగితం ముక్కల మీద పెన్సిల్‌తో రఫ్ స్కెచ్‌లను వేసుకుందాం. ఆ వస్తు సముదాయాన్ని ఈ మూల నుండి చూస్తూ మరొకటి, మరో ప్రక్క నుండి చూస్తూ ఇంకొకటి అలా నాలుగయిదు రఫ్ స్కెచ్‌లు వేసుకుని ఏ రకంగా వేసుకుంటే బాగుంటాయో చూడాలి. అవసరమయితే ఆ వస్తువుల సముదాయం యొక్క స్కెచ్‌ని తగిన సైజులో వేసుకోవాలి.


వివిధ కోణాల నుండి చూసి రఫ్ స్కెచ్‌లు వేసుకోవాలి.

స్టిల్ లైఫ్‌లకు పెద్ద ఫుల్ షీటుగాని లేక 1/2 షీటు గాని సాధారణంగా యెంచుకుంటాం. నేర్చుకునేటప్పుడు పావు షీటు సైజు కాగితాలువాడతాం. లేదా ఒక కేన్వాస్ ను దీర్ఘ చతురస్ర ఫ్రేముకుబిగించయినా ఆయిల్ పెయింటుకు సిద్ధం చేస్తాం. ఏది తీసుకున్నా, ఆ ఫ్రేముకు (లేదా పేనల్‌కు) తగినంత బొమ్మని చిత్రించాలి దానిలో మరీ చిన్న బొమ్మ వేసినా బాగోదు. మరీ నిండా పెద్ద బొమ్మ వేసినా బాగోదు. ఆ పేనల్‌లో మరీ ఒక మూలకు గానీ, మరీ ఒక ప్రక్కకు గానీ, పైకిగానీ వెయ్య కుండా మధ్యలో వేస్తే బాగుంటుంది. చుట్టూ కాస్త మార్జిన్ వుంచితే చాలు చూడటానికి బాగుంటుంది.

స్టిల్ లైఫ్ చిత్రంలో వాటి వాటి రంగులనూ, రూపాలనూ, నేచురల్‌గా సహజ సిద్ధంగా చిత్రించండి. గాజు, స్టీలు పాత్రలను చిత్రించగలడం నైపుణ్యానికి నిదర్శనం. ఆయా వస్తువులను బాగా పరిశీలించి వాటి అసలు రంగులు యేమిటి? వాటి నీడలు యెక్కడెక్కడ వున్నాయి. గమనించి చిత్రించాలి. ఆ వస్తువు యొక్క అసలు రంగుకు కొంత వైలెట్ కలిపితే దాని నీడరంగు వస్తుంది. నీడలు చిత్రించడానికి కొందరు నలుపు కలుపుతారు. అది బాగోదు. ఆ వస్తువులపై మెరుపులు (High Lights) చూపడానికి తెల్లని చుక్కలు పెట్టాలి. నీటి రంగుల చిత్రంలో అయితే మెరుపుల వద్ద పేపరుతెలుపునే ఏ రంగు వేయకుండా విడిచి పెట్టాలి. ఆ వస్తువులు ఒకదానికొకటి పోల్చుకొని తగిన సైజులో వున్నాయో లేదా చూసుకోవాలి.

# ప్రకృతి దృశ్యాలు

# LANDSCAPES

ప్రకృతిలో ఒకో దృశ్యం చాలా అందంగా కనబడుతుంది.? దానిని చూసి పరవశించిపోతాం. దానిని చిత్రించి దాచుకోవాలని కోరిక కలుగుతుంది. చిత్రించడం రాకపోతే ఫోటో తీసుకుందాయనయినతా అనిపిస్తుంది.

ఒక కాలువకు అటూ ఇటూ గట్లూ, అగట్ల మీద చెట్లూ వుంటే యెంత బావుంటుంది. ఆ కాలువలో ఒక తెరచాప పడవ వుంటే మరీ అందంగా వుండదూ.

పచ్చటి పొలాలూ, పొలాలలో వ్యవసాయం చేసే కూలీలూ. బ్యాగ్రౌండ్‌లో కొండలూ వుంటే చూడముచ్చటగా వుండదూ.

ఒక పెద్ద కాలువ, దానిపై ఒక అందమైన బ్రిడ్జి, దాని మీద ఎర్రని బస్సులు కనిపిస్తే చూడముచ్చటగా వుంటుంది.

అడవిలో అండమైన జలపాతం గానీ, వంకర టింకరగా ప్రవహించే సెలయేరుగానీ. కనిపిస్తే చూడముచ్చటగా వుంటుంది.

ఒక పెంకుటిల్లు, దానికి అటూ ఇటూ కొబ్బరిచెట్లూ వున్నాయి. పైన చంద్రబింబం చల్లగా తెల్లగా వుంటే యెంత బాగుంటుంది.

ఒక రోడ్డు, ఆ రోడ్డు ప్రక్కల ఎత్తయిన చెట్లు, ఆ రోడ్డు మీద ఆ చెట్ల నీడలలో ఒక ఎద్దుల బండీ, లేదా ఒక కారు నడుస్తుంటే ఎంత బాగుంటుంది.

ఇలాంటివే అనేక ప్రకృతి దృశ్యాలు మిమ్ములను పులకరింప చేస్తూ వుంటాయి. తరతరాలుగా మనుషులనూ పులకరింపచేశాయి. అని జాతుల ప్రజల హృదయాలనూ కదిలించి వేశాయి. చైనా నుండి అమెరికా వరకూ ఈ ప్రపంచములోని ఆర్టిస్టులందరు మంచి మంచి దృశ్యాలను ఎన్నో చిత్రించారు. కొన్ని కాలాలలో మనుషల కంటె, వస్తువులకంటె ప్రకృతి దృశ్యాల చిత్రణే ప్రాముఖ్యత వహించి వుండేది కూడా. చైనా వారి పెయింటింగ్‌లలో ప్రకృతి వర్ణణ విపరీతంగా కనుపిస్తుంది. ప్రతి ఆకునీ, రెమ్మనూ చిత్రించారా అనిపిస్తుంది. అడవి జంతువులనూ, ఆకాశంలో మేఘాలనూ, పక్షులనూ, కొండలమీది రాళ్ళను, సెలయేరుల్లోని సాగరాలలో అలలను చక్కగా చిత్రించారు.



ఇండియాలోని సాంప్రదాయక చిత్రకళలోకూడా రాజస్థానీ పెయింటింగ్‌లలోనూ, మొగల్ కాలపు చిత్రాలలోనూ, కాంగ్రాపెయింటింగ్‌లలోనూ ప్రకృతి వర్ణనలు ఎక్కువగా కనిపిస్తాయి.

ప్రకృతి దృశ్యాన్ని చిత్రించడాన్నే "LandScape Painting" అంటారు. వీటిని నీటి రంగులతోనూ, నూనె రంగులతోనూ, సాధారణంగా చిత్రిస్తారు. అప్పుడప్పుడు క్రేయాన్స్ తోనూ, పేస్టల్స్‌తోనూ, పోస్టరు కలర్స్‌తోనూ, వాష్ డ్రాయింగ్‌తోనూ చిత్రించుతూ వుంటారు. ముందు పెన్సిల్ షేడ్‌లతో ప్రాక్టీసు చేయడం మంచిది. ముందు నల్లని పెన్సిళ్ళతోనూ, తరువాత కలర్ పెన్సిళ్ళతోనూ వేస్తారు.

ప్రకృతి దృశ్యాలు చిత్రించడానికి ఫోటోల మీదా, కెమేరాల మీదా ఆధారపడకూడదు. అందంగా కనబడే ప్రదేశాలకు వెళ్ళి స్వయంగా చిత్రించుకోవాలి. ఒంటరిగా వెళ్తే బోర్‌గా వుంటుందనుకుంటే స్నేహితులనో, తోటి



ఆయిలీ పేస్టల్స్ చిత్రం

వాటర్ కలర్స్‌తో స్టిల్‌లైఫ్



అతికింపుల(COLLAGE) చిత్రం



చిత్రకారులనో తీసుకుని వెళ్ళాలి. సముద్రపు ఒడ్డుకో, కొండ ప్రాంతానికో, సరస్సులోనికో,మంచి వంతెనలున్న కాలువవైపో, తోటల వైపో, నదులవద్దకో ఎక్స్‌కర్షన్ లాగా వెళ్ళవచ్చు. ప్రాక్టీసు కోసం ముందుగా మీరున్న వూరులోనే మంచి దృశ్యాలను ఎంచుకొని చిత్రించవచ్చు.

రంగులూ, పరికరాలూ, పట్టుకొని వెళ్లి అక్కడే (On the Spot) కూచుని చూస్తున్న ఆ దృశ్యాన్ని చిత్రించడం మంచి పద్ధతి. అక్కడే రంగులు పూయడానికి టైమ్ చాలదనుకునే వారు. ఆ దృశ్యాన్ని పెన్సిల్‌స్కెచ్ వేసుకొని ఆ స్కెచ్‌లోని అంశాలన్నిటి పైన అవి ఏయే రంగులను కలిగి వున్నాయో నోట్ చేసుకుంటారు.తన స్టూడియోకి (లేదా ఇంటికి) వెళ్ళాక ఆ నోట్సును చూసి పెద్ద సైజులలో కేన్వాసు మీదనో, కాగితం మీదనో స్కెచ్ వేసుకొని ఆ నోట్సు ప్రకారం రంగులు వేసుకుంటారు. వాటర్ కలర్స్‌ను తీసుకుని వెళ్ళి ఆ చోటులోనే చిత్రించడం మంచిది. నీటి రంగుల చిత్రం తొందరగా అయిపోతుంది కూడా. ఆయిల్ కలర్స్ వాడేవారు ఇంటి వద్ద వేసుకోవడమే మంచిది. నూనె రంగుల చిత్రం తొందరగా పూర్తవదు. పూర్తయినా ఆరదు. దాన్ని బట్టలకు అంటుకోకుండా మోసుకు రావడానికి శ్రమ పడాలి.

ప్రకృతి మనం కళ్ళతో మామూలుగా చూస్తే విశాలంగా కనిపిస్తూ ఎక్కడి నుండి ఎక్కడికి వెయ్యాలో అర్థం కాదు. కాస్త అలవాటు పడితే ఇక్కడి నుండి ఇక్కడికి వేస్తే బాగుంటుంది అని నిర్ణయించుకోగలుగుతాం. అందుకని కొత్తార్టిస్టులు ఒక చిన్న అట్ట ఫ్రేమును తయారు చేసుకుని వెళ్ళడం మంచిది. అది 6 అంగుళాల వెడల్పు 8 అంగుళాల పొడవూ వుండే అట్ట ముక్క. అందులో 4 అంగుళాల వెడల్పు 6 అంగుళాల పొడవువుండే దీర్ఘ చతురస్రాన్ని కత్తిరించి తీసెయ్యాలి. ఆ ఫ్రేమును ముఖం ముందు పెట్టుకొని దాని గుండా దృశ్యాన్ని పరిశీలించాలి. అప్పుడు ఎక్కడినుండి ఎక్కడి వరకు బాగుంటుందో తెలిసి పోతుంది. ఆ దృశ్యాన్ని చిత్రించుకోవడం సులువుగా వుంటుంది. ఈ ఫ్రేమును "గాడ్జెట్" అంటారు. సీనియర్ ఆర్టిస్టులు ఈ గాడ్జెట్ అవసరం లేకుండానే చిత్రించగలుగుతారు.

మనకు కనిపించే దృశ్యం యొక్క స్కెచ్ ను వేసేటప్పుడు గమనించ వలసిన విషయాలు చూద్దాం. HB డ్రాయింగ్ పెన్సిల్‌తో లైట్‌గా గీస్తూ స్కెచ్‌ని వేసుకోవాలి. నల్లటి గీతతో గీశామో నీటి రంగులు వాడిన తరువాత గూడా ఆ గీతలు కనబడుతూనే వుంటాయి. గనుక నల్లటి గీతలు స్కెచ్‌కి పనికి రావు.

ముందుగా మనం దృశ్యాన్ని చిత్రించడానికి ఒక ఫ్రేమును గీసుకోవాలి. అది 2:3 దీర్ఘ చతుర్రస్రం అయితే బాగుంటుంది. తరువాత Horizon (దిక్ చక్రం) ని గీసుకోవాలి. తరువాత దృశ్యములోని అంశాలను చిత్రించవచ్చు. హోరైజన్ అంటే తెలుసుకదూ, ఆకాశం భూములను విభజించే రేఖ. ఈ రేఖను కరెక్టుగా కాగితం మధ్యలో గీయడం మంచిది కాదు. బొమ్మ అకర్షణీయంగా వుండాలంటే ఈ దిక్ చక్రాన్ని మన ఫ్రేములో సరిగ్గా మధ్యన గాక కాస్త పైన కానీ క్రింద గానీ వేసుకోవాలి. దిక్ చక్రాన్ని మరీ ఫ్రేములోని పై భాగంలో వేసుకుంటే చిత్రం విహంగ దృష్టితో (Birds Eye view) వుంటుంది. అంటే మనం నేల మీద వుండి గాక పైకి ఎగురుతూ చూస్తున్నట్లుంటుంది. నేల భాగం ఎక్కువగా కనిపిస్తుంది. ఆకాశ భాగం తక్కువ కనబడుతుంది. దిక్ చక్రాన్ని

ఫ్రేములో క్రింద భాగాన వేసుకుంటే మనది కీటక దృష్టి (Worms Eye View) లా వుంటుంది. అంటే మనం నేల మీద ప్రాకుతూ ఆ దృశ్యాన్ని చూస్తున్నట్లుంటుంది. ఆకాశం ఎక్కువగా కనిపిస్తుంది.



ఇలాంటి గాడ్జెట్ ని చేసుకొని ప్రకృతిని దాని గుండా చూడండి.




దృశ్యాన్ని చిత్రిస్తున్నప్పుడు పెర్‌స్పెక్టివ్ సూత్రాలను బట్టి గీసుకుంటాం. దూరపు వస్తువులు చిన్నవిగానూ, దగ్గర వస్తువులు పెద్దవిగానూ వుంటాయి కదా. అలా చిత్రించడమే పెర్ స్పెక్టివ్. అంతే గాక రోడ్‌లు, వంతెనలు, చెట్ల వరుసలు మొదలైన రేఖలు దిక్ చక్రం మీద ఒక కేంద్రం (Vanishing Point) వద్దకు వాలుతున్నట్లుగా చిత్రించడం కూడా పెర్‌స్పెక్టివ్ సూత్రాల ప్రకారం చేస్తాం. "డ్రాయింగ్ నేర్చుకోండి" పుస్తకంలో పెర్ పెక్టివ్ వ్యాసంలో ఈ విషయాలు తెలియ జెయ్య బడినాయి.

చిత్రం గీసేటప్పుడు కాంపోజిషన్ (కూర్పు) సూత్రాలు కూడా దృష్టిలో వుండాలి. చిత్రంలోని అంశాలు అందంగా పేర్చడమే కాంపోజిషన్ లక్ష్యం. అంతే గాక చిత్రంలోని ఆకర్షణ కేంద్రాన్ని (Centre of Intrest) తగిన చోట చిత్రించడము కూడా కాంపోజిషన్ విజ్ఞానమే. చిత్రంలోని అంశాలు మరియు రంగులు ప్రేక్షకుని దృష్టిని ఆకర్షించుతూ నడుపుతూ ఆకర్షణ కేంద్రం వద్దకు నడిపేలా అమర్చాలి. ఈ కాంపోజిషన్ సూత్రాలు కూడా "డ్రాయింగ్ నేర్చుకోండి" గ్రంథంలో 'కూర్పు - పేర్పు' వ్యాసంలో వున్నాయి.

మనకు కనుపించే దృశ్యంలోని అంశాలన్నింటినీ కెమేరాలాగా కాపీ చేయ్యాలని యెక్కడా లేదు. కొన్ని అంశాలను వదిలి వెయెయ్యచ్చు. అక్కడ రెండు ఇళ్ళు వున్నాయనుకోండి. ఒకటి వేస్తే బాగుంటుందనిపించిందనకోండి, రెండో దాన్ని వదిలి వేయెచ్చు. అలాగే ఏదన్నా ఒక చెట్టును ఇక్కడ పెడితే బాగుంటుందనిపిస్తే దానిని చేర్చవచ్చు. ఈ రకమైన మార్పులకు చిత్రకారునికి అవకాశం వున్నది. ఈ మార్పు ఆ దృశ్యాన్ని మెరుగు పరుస్తుందనుకుంటే అలా చేయవచ్చు. దీన్ని ఆర్టిస్టు యెంపిక (Artist's Selection) అంటారు.

ఆయిల్ పెయింట్ తో వేసే చిత్రకారులు స్కెచ్‌ని బరంట్ సియెన్నాతో టర్పెంటైన్‌ను కలుపుకొని సన్నని (నెం.1) బ్రష్‌తో వేసుకుంటారు. అంటే పెన్సిల్ వాడరు. ఎక్కడన్నా తప్పు గీతపడితే ఉత్త టర్పెంటైల్‌లో ముంచిన బ్రష్‌తో లేదా గుడ్డతో దాన్ని తుడిచేస్తారు. మరల రంగులో సరయిన రేఖను గీసుకుంటారు. ఈ టర్పెంటైన్‌తో వేసిన రంగు రేఖలు నిముషాల్లో ఆరిపోతాయి కూడా.

లాండ్ స్కేప్ (దృశ్య చిత్రణ)లకు రంగులు వెయ్యడం గురించి పరిశీలిద్దాం. ఫ్రేములో వున్న దిక్ చక్రం పైదంతా ఆకాశం. ఆకాశానికి వివిధ రకాల నీలములను వాడి చూడండి. చిత్తు పేపరుపై కోబాల్ట్ బ్లూ, ప్రష్యన్ బ్లూ, అల్ట్రా మెరీన్ బ్లూ మెదలయిన రెడీగా వున్న నీలం రంగులనేగాక ఆ బ్లూతో కాస్త వరిడియస్ గ్రీన్, కాస్త వెర్మిలియన్ రెడ్ వగైరాలను కలుపుకొని వివిధ బ్లూ షేడ్‌లలో ఏదయినా వాడవచ్చు. ఎదురుగా వున్న ఆకాశం రంగుకు సరిపోయిన దానిని ఆఖరికి వాడండి. మరొక విషయం గుర్తుంచుకోండి. దిక్ చక్రానికి దగ్గరగా వున్న ఆకాశం కాస్త లైట్‌గా వుంటుంది. నీటి రంగులయితే నీరు ఎక్కువ కలిపిన బ్లూని, నూనె రంగులయితే తెలుపు రంగు కలిపిన బ్లూని అక్కడ పెయింటింగ్ చెయ్యాలి. మేఘాలు ఉత్త తెల్లగానే కాక కాస్త నీలం, ఎరుపు, పసుపు కలిసి బూడిద రంగు లేదా వూదా రంగుగా వుంటాయి. మేఘంమీద కూడా కొంత వెలుగు నీడ వుంటుంది. వెలుగు వైపు తెలుపు, నీడ వైపు బూడిద రంగు లేదా వూదా రంగూ వెయ్యాలి.

దిక్ చక్రం క్రింద వున్న నేలను మూడు రకాలుగా విభజించ వచ్చు. ఫోర్ గ్రౌండ్ (ముందునేల), మిడిల్ గ్రౌండ్ (మధ్య నేల), బ్యాక్ గ్రౌండ్ (చివరి నేల) ఫోర్ గ్రౌండ్ (Fore Ground) అంటే మన ముందున్న నేల అందులోని అంశాలు. అవన్నీ మనకు దగ్గరగా వుండడం వల్ల వాటి వాటి స్వంత (Local Colour) రంగులతో వుంటాయి. చెట్టు కాండం బ్రౌన్, చెట్ల ఆకులు పచ్చగానూ, పువ్వులు ఎర్రగానూ కనిపిస్తాయి. వాటికి వాటి వాటి రంగులను చిత్రిస్తాము.

కాస్త మిడిల్ గ్రౌండ్‌కు వెళ్తే అక్కడున్న చెట్ల రంగులూ, గడ్డి రంగులూ కాస్త మారతాయి. వాటి స్వంత రంగు కొంత తగ్గుతుంది. బూడిద రంగు లేదా ఊదా రంగు గానీ కొంత కలుస్తుంది.

ఇంకాస్త వెనుక వున్న బ్యాక్‌గ్రౌండ్‌లోని అంశాలు అయితే వాటి స్వంత రంగులు మరింత తగ్గి బూడిద రంగు ఎక్కువగా వుంటుంది. ఇలా ఎందుకు జరుగుతుందంటే మనకు దూరంగా మిడిల్ గ్రౌండ్, బ్యాక్ గ్రౌండ్‌లకు మన కంటికి మధ్య వున్న వాతావరణం ఒక తెర వలె పనిచేసి అంత దూరంలో వున్న వస్తువులు ఒక

పలుచని తెర గుండా చూసినప్పుడు వాటి రంగుల తీవ్రత తగ్గిపోయినట్లే కనిపిస్తాయి. ఎందుకంటే వాతావరణంలో గాలితో పాటు దుమ్ము ధూళి కణాలుంటాయి. అవి ఒక తెర వలె లేదా గాజు పలక వలె పనిచేస్తాయి.

ఆయా వస్తువుల నీడలు కూడా దూరం వెళ్ళిన కొద్దీ లైట్ గా వుంటాయి. దగ్గరగా వున్న నీడలు చిక్కగా వుంటాయి. మన దగ్గరలో నేల మీద ఒక చెట్టుందనుకోండి. ఆ చెట్టు నీడ బ్రౌన్‌గా వున్న నేలమీద పడుతున్నది. రోజ్ మేడర్, వరిడియన్ గ్రీన్ (అయిల్ కలర్స్) లను కలవగా వచ్చిన వయిలెట్ రంగును ఆ నేల రంగు (బ్రౌన్)తో కలిపి ఆ నీడను చిత్రించాలి. నీటి రంగులలో అయితే క్యార్మైన్ రెడ్, వరిడియన్ గ్రీన్‌లను కలుపుకొని ఈ వయిలెట్ కలర్‌ను తయారు చేసుకోవచ్చు. నీడ రంగుకోసం నలుపు తెలుపు కలిపి బూడిద రంగు చెయ్యకుండా, ఈ రకం వయిలెట్‌ను ఎక్కువమంది ఉపయోగిస్తారు. దృశ్యంలోని వస్తువుల నీడలన్నీ ఒక వేపుగా వుండనీయండి. నీడ ఒక వస్తువుకు ఎడమ ప్రక్కన మరొక వస్తువుకు కుడి ప్రక్కన చిత్రించితే అవాస్తవంగా వుంటుంది.

ఇక మీరు లేండ్ స్కేపు పెయింటింగ్‌లను ప్రయత్నించండి. ఎన్ని వేస్తే అంత మంచిది.

# "కొలాజ్" అనబడే అతికింపుల చిత్రకళ

20వ శతాబ్దం ఆరంభంలో పారిస్లో పికాసో లాంటి యువ చిత్రకారులు ఈ విధానాన్ని 1910లో ప్రారంభించారు. చిత్రాలు వెయ్యడానికి రంగులే అవసరంలేదు. కుంచెలూ అవసరంలేదని చాటిచెప్పారు. కత్తెరతో రంగు కాగితాలను కత్తిరించి అతికించి పెయింటింగ్‌లు తయారు చేశారు. అదే కొలాజ్ (Collage) చిత్రకళ.

ఈ విధానంలో అనుకున్న చిత్రం ఔట్‌లైన్‌లను మామూలుగా పెన్సిల్‌తో వేసుకుంటారు. దానికి రంగులతో నింపరు. ఆ స్కెచ్‌లోని వివిధ అంశాలను దానికి సరిపడే రంగు కాగితాలను కత్తిరించి ఆయా చోట్ల అతికిస్తారు. ఆవిధంగా రంగులను నింపుతారన్నమాట.

ఒక చిత్రంలో సూర్యుడు, ఇల్లు, చెట్టు వుందనుకోండి. పెన్సిల్ ఔట్‌లైన్ మాత్రం వెయ్యబడింది. సూర్యుడులో అతకడానికి పసుపు పచ్చని పేపరు ముక్కలు కావాలి. చెట్టు కాండానికి బ్రౌను పేపరు ముక్కలు, కావాలి. చెట్టు ఆకుల సముదాయానికి ఆకుపచ్చని పేపరు ముక్కలు, ఆకాశానికి నీలపు పేపరు ముక్కలు, పెంకుటిల్లు పైభాగానికి ఎర్రని పేపరు ముక్కలు, ఇల్లు గోడలకు తెల్లని పేపరు ముక్కలు అతికిస్తాం. ఈ పేపరు ముక్కల కోసం పలుచని రంగు పేపర్లు పనికిరావు. జిగురు అంటించగానే వంకరలు తిరిగి పోతాయి. మందపాటివి, నిగనిగలాడుతున్నవి అయితే ఆకర్షణీయంగా వుంటాయి. గనుక ఖరీదైన మ్యాగజీన్‌లలో ప్రింటయ్యే రంగు రంగుల పేపర్లు కత్తిరించుకోవచ్చు. బజారులో కొనుక్కునే సబ్బుబిళ్ళలకు చుట్టబడి వుండే లేబుళ్లు చక్కని రంగులతో, మందంగా వుంటాయి. అవయితే భలే పనికొస్తాయి.

కొందరు చిత్రకారులయితే రంగు రంగుల ప్లాస్టిక్ షీట్లను, రంగురంగుల గుడ్డ ముక్కలనూ అంటిస్తారు. అలాంటివి అంటించడానికయితే చిక్కని ఫెవికాల్ లాంటి జిగురులు వాడాల్సి వుంటుంది. రంగురంగుల పక్షి ఈకలను కూడా అంటించడానికి వుపయోగించవచ్చు.

కత్తిరింపులకుపయోగించే రంగు కాగితాలపై అక్షరాలు ప్రింటయివున్నా అభ్యంతరంలేదు.

కాబట్టి మనకు మంచి కత్తెర. ఫెవికాల్ లాంటి జిగురు పదార్థాలు కావాలి. చిత్రం వేయడానికి మందమైన తెల్లని కార్డులను, ఐవరీ బోర్డుగాని, స్నోవైట్ బోర్డు గాని, సాధారణ కార్డు బోర్డులు గాని వుపయోగించవచ్చు.

కత్తిరింపుల విధానంతో చిన్న చిన్న గ్రీటింగ్ కార్డులు కూడా చేసుకోవచ్చు.



# ఫ్యాబ్రిక్ పెయింటింగ్

చీరలపైన గానీ, వోణీలపైగాని, లంగాలపైగాని, కుర్తాలపై గానీ మనకు నచ్చిన అందమైన డిజైన్‌లను మనమే వేసుకోవచ్చు. అలా గుడ్డలపై వేసుకునే రంగులనే ఫ్యాబ్రిక్ పెయింటింగ్ లంటారు.

ఫాబ్రిక్ పెయింటింగ్‌లు సీసాలలో లభిస్తాయి. వాటితో కలిపి వేయడానికి "మీడియం" వుంటుంది. దానినే కలపాలి. నీళ్లు గాని, టర్పెంటైన్‌గాని కలిపి వెయ్యకూడదు. ఈ రంగులు వేయడానికి కుంచెలు కావాలి. రౌండ్‌వి, ఫ్లాట్‌వి పనికొస్తాయి. సన్నని ఔట్‌లైన్‌లకు పాయింట్ బ్రష్‌కూడా అవసరమే. సేబుల్ హెయిర్ బ్రష్‌లయితే బాగుంటాయి. ప్రాక్టీసు చెయ్యడానికి పలుచని తెల్లగుడ్డ. గుడ్డను బిగించడానికి ఎంబ్రాయిడరీ రింగు కావాలి. బ్రష్‌లు కడుక్కోవడానికి నీరు కూడా కావాలి.



మనకు నచ్చిన డిజైన్‌లను ముందు రెడీ చేసుకోవాలి. ఫాబ్రిక్ పెయింట్ వేసే గుడ్డను సబ్బు లేదా సర్ఫ్ నీళ్లతో వుతికి ఆరేసి దానిని ఇస్త్రీ చేసింతరువాతనే ఫాబ్రిక్ పెయింట్లు వెయ్యాలి. బజారులో కొనుక్కొచ్చిన గుడ్డను వెంటనే వుపయోగించకూడదు. దానికి గంజిపిండి వుంటుంది. అది పోవాలన్న మాట. కొత్త గుడ్డ మీద పెయింట్ చేస్తే అది గంజి మీదనే అంటుకొని వుండి వుతికేటప్పుడు ఆ గంజిపిండితో బాటు పోతుంది. అలాగాకుండా వుతికి ఇస్త్రీ చేసిన బట్టయితే వేసే రంగు ప్రతి దారాన్ని చక్కగా అంటుకుని స్థిరంగా వుండిపోతుంది. గనుక ఇస్త్రీ పెట్టె కూడా మనకు అవసరమే.

అలాంటి గుడ్డను ఒక క్లిప్‌పేడ్ మీదగాని, ఎంబ్రాయిడరీ రింగ్‌మీదగాని సాగదీసి బిగించాలి. దానిపై B పెన్సిల్‌తో డిజైన్‌ను వేసుకోవచ్చు. ఫ్రీహేండ్ డ్రాయింగ్ అలవాటులేని వాళ్లు ట్రేసింగ్‌తో వేసుకుంటారు. మనం ఎంచుకున్న డిజైన్‌పై ట్రేసింగ్ పేపరును పెట్టి దానిపై స్కెచ్ పెన్‌తో స్కెచ్ వేసుకుంటాం. ఇప్పుడా ట్రేసింగ్‌పేపరును గుడ్డమీద పెట్టి-ఆ రెంటి మధ్యలో కార్బన్ పేపరు పెట్టాలి సుమా- H పెన్సిల్‌తో గట్టిగా నొక్కి గీస్తాం. అది గుడ్డపై నీలంగా ముద్రపడుతుంది. ఆ విధఃగా డిజైన్ స్కెచ్‌ని గుడ్డపై సిద్ధం చేసుకుంటాం.

ఇప్పుడిక రంగులు వేయాలి. ఫాబ్రిక్ రంగు సీసాలు, మీడియం సీసా, సాసరు, కుంచెలు, ఒక లోటాడు నీరూ రెడీ చేసుకోవాలి. మనకు కావలసిన రంగును ఒక ఒంతు సాసరులో వేసుకుని దానికి రెండు వంతులు మీడియంను కలపాలి. ఆ రెండు బ్రష్‌తో బాగా కలపాలి. ఆదే వేయవలసిన రంగు అవుతుంది. దాన్ని కుంచెతో గుడ్డమీద పూస్తారు.

ఈ రంగులు పలుచగానే పూస్తాం. మందంగా వేస్తే బట్ట ముడతలు పడదు కదా మరి. రంగు స్ప్రెడ్ అవుతుంది. కూడా. ఫాబ్రిక్ పెయింట్‌లలో ఏ రంగులయినా లేతరంగుగా చేసుకోవాలంటే ఆ రంగుకు తెల్ల రంగును కలుపుకుంటామే గాని మీడియం ఎక్కువ వేయనవసరంలేదు. ఏ రంగయినా డార్కుగా వుండాలంటే దానితో నల్లరంగు కలుపుకుంటాం. గనుక నలుపు, తెలుపు కూడా దగ్గరుండాలి. గుడ్డమీదనే ఒక రంగు వేసి ఆ షేడ్‌లు సాధించవచ్చు.

రౌండ్ బ్రష్‌లతో కొన్ని రకాల స్ట్రోక్స్‌ను, ఫ్లాట్ బ్రష్‌లతో కొన్ని రకాల స్ట్రోక్స్‌ను అలవాటు చేసుకోవాలి. గడ్డి పరకలు, ఆకులు, పూరేఖలు లాంటి వాటిని ఒక్కో స్ట్రోకుతోనే వేసెయ్యవచ్చు. అలాంటివే చూడముచ్చటగా వుంటాయి.

పది పన్నెండు రంగులను దగ్గరుంచుకోవాలి. రంగువేయడం పూర్తవగానే బ్రష్‌లను నీటిలో బాగా కడగాలి. కడక్కుండా రంగుతో ఆరనిచ్చామో బ్రష్‌లు పాడయిపోతాయి. రంగు సీసాల్లో రెండేసి చుక్కలు మీడియం వేసి మూతలు పెట్టేయడం మంచిది. ఆ రంగులు ఎండిపోకుండా వుంటాయి. ఈ రంగు సీసాలను ఎక్కువసేపు మూతలు తెరిచివుంచకూడదు.

రంగులేయబడిన గుడ్డను మూడు రోజుల పాటు ఆరనిచ్చి దాన్ని ఇస్త్రీ చేయాలి. ఇస్త్రీ పెట్టెను రంగులేని వైపునే రుద్దాలి. అప్పుడు డిజైన్ బట్టకు చక్కగా అంటుకుంటుంది. శాశ్వతంగా వుంటుంది.









ఫాబ్రిక్ పెయింట్‌లలో పలుచని వాటర్ కలర్స్ టెక్నిక్ లాగానూ, చిక్కని ఆయిల్ కలర్స్ టెక్నిక్‌లాగానూ, పొడిపొడిగా పేస్టిల్ వర్కులాగా "డ్రైబ్రష్" టెక్నిక్‌నీ చిత్రించవచ్చు. రంగులో ముంచిన బ్రష్‌పై రంగును కొంత తొలగించి పొడిపొడిగా అంటిస్తే అది డ్రైబ్రష్ స్ట్రోక్కునిస్తుంది. రంగుతో మీడియంను కలిపి పలుచగా చిత్రిస్తే వాటర్ కలర్‌తో వేసే వాష్ టెక్నిక్‌లా వుంటుంది. రంగులను చిక్కగా వాడితే ఆయిల్ కలర్ టెక్నిక్‌లాగా వుంటుంది.

ఫాబ్రిక్ రంగులతో వుపాయంగా కొన్ని ముద్రలు కూడా ప్రింట్ చేయొచ్చు. బెండకాయ మధ్యలో కోసి దాని బ్రష్‌తో రంగు పూసి గుడ్డపై ముద్రలు వేస్తే భలే డిజైన్ వస్తుంది. అలాగే గట్టి వంకాలనో, బంగాళదుంపనో మధ్యలోకి కోసి దానిపై ఏదన్నా డిజైన్‌లాగా చాకుతో చెక్కి దానిపై రంగును కుంచెతో అద్ది దానితో గుడ్డలపై ముద్రలు వేయవచ్చు. ఏదయినా గట్టి ఆకును తీసుకుని ఆ ఆకుపై రంగు పూసి దానిని గుడ్డలపై అదిమితే ఆకులాంటి డిజైన్ పడుతుంది. వుపాయంగా యిలాంటి రకరకాల డిజైన్‌లను మీ బట్టలపై వేసుకోండి.

# పదజాలం

చిత్రకారులు తెలుసుకోవలసిన పదజాలాన్ని ఈ వ్యాసంలో తెలియ జేస్తున్నా. సాధారణంగా యీ రోజుల్లో ఇంగ్లీషు పదాలనే వాడుతున్నాం.

| | | |
|---|---|---|
| Drawing | : | గీయబడిన చిత్రం. సాధారణంగా పెన్సిల్‌తో వేసే చిత్రాన్ని డ్రాయింగ్ అంటాం. |
| Painting | : | వర్ణ చిత్రం. రంగులతో వేయబడిన చిత్రం. బొమ్మ లేకుండా రంగులను పూయడాన్ని కూడా పెయింటింగ్ అంటారు. |
| **Art** | : | కళ |
| Fine Art | : | లలిత కళ (చిత్రలేఖనం, సంగీతం, శిల్పం, నృత్యం వగైరా కళలు) |
| Sketch | : | గీతలతో తొందరగా చిత్తుగా వేయబడిన చిత్రం. పెన్సిల్‌తోగాని, చార్ కోల్‌తో గాని, స్కెచ్ పెన్‌తో గాని వేయబడుతుంది. |
| Free Hand Drawing | : | స్కేలు వగైరా పనిముట్లు వాడకుండా వుత్త చేత్తోనే వేయబడిన డ్రాయింగ్. |
| Scale Drawing | : | స్కేలు సాయంతో వేయబడిన డ్రాయింగ్. |
| Folk Art | : | జానపద చిత్రకళ.ప్రజలలో వాడుకలలో వున్న ముగ్గులు వగైరా. |
| Tribal Art | : | గిరిజనులలో వాడుకలో వున్న చిత్రకళ. |
| Tantrik Art | : | గుప్త భావాలను చిత్రించే విధానము. |
| Graphic Art | : | ఒక తలం మీద పని చేసి,మరో తలం మీద ముద్ర వేసి తయారు చసిన చిత్రం. లితోగ్రఫీ, వుడ్ కట్, ఎచ్చింగ్, ఎన్ గ్రేవింగ్, స్క్రీన్ ప్రింటింగ్ మొదలైనవి ఇందులోకి వస్తాయి. |
| Seriography | : | సిల్క్ స్క్రీన్ ప్రింటింగ్ విధానం, పట్టు వస్త్ర ముద్రణ |
| Lithography | : | రాతి మీద డ్రాయింగ్ వేసి కాపీలు తీయుట, రాతి ముద్రణకు నాప రాయి ని వాడతారు. |

| | | |
|---|---|---|
| Visual Arts | : | కనబడే కళ. చిత్రకళ, గ్రాఫిక్స్, వగైరాలు దృశ్యకళలు. |
| Collage | : | రంగు కాగితాలనో, రంగు గుడ్డలనో, ఫొటోలనో కత్తిరించి ఆ ముక్కలను అతికించి తయారు చేసిన చిత్రం. |
| Figure Drawing | : | మనుషుల బొమ్మలు చిత్రించుట. |
| Nature Drawing | : | ప్రకృతిని చిత్రించుట. |
| Memory Drawing | : | వూహా చిత్రం, వూహించి లేదా జ్ఞాపకం తెచ్చుకుని చిత్రించడం. |
| Object Drawing | : | వస్తువులను చూసి చిత్రించడం. |
| Cartoons, Comics | : | వ్యంగ్య చిత్రాలు. |
| Liettering | : | అందముగా అక్షరాలు రాయుట. |
| Fresco | : | గోడలపై తడిగా వున్న సున్నముపై నీటి రంగులతో చిత్రించు విధానం. |
| Tempera | : | కోడిగుడ్డు సొనతో కలసిన రంగులతో చిత్రించు విధానం. |
| Water Colours | : | నీటితో కలిపి వేసే రంగులు |
| Oil Colours | : | నూనెతో కలిపి వేసే రంగులు. |
| Polymer Paints, Acrylic Paints, Emulsion Paints | : | ఇవి క్రొత్తగా వచ్చిన ప్లాస్టిక్ పెయింట్లు, నీటితో కలిపి వేయవచ్చు. త్వరగా ఆరిపోతాయి పేపరు మీద గోడమీద, కేన్వాసు మీద, చెక్కమీదా వేయవచ్చు. |
| Caricature | : | మనిషిని వ్యంగంగా చిత్రించుట. |
| Portrait | : | మనిషిని సహజ సిద్ధంగా చిత్రించుట. |
| Nude | : | వివస్త్రగా మనిషిని చిత్రించుట. |
| Still Life | : | వస్తువులను పేర్చి చిత్రించుట. |
| Land Scape | : | ప్రకృతి దృశ్యాన్ని చిత్రించుట. |
| Bathic | : | గుడ్డమీద రసాయనాలతో ప్రింటు చేసే విధానము. |
| Art Exhibition | : | చిత్రకళా ప్రదర్శన. |

## Art Material : **చిత్రకళ కుపకరంచు పనిముట్లు, పరికరాలు.**

| | | |
|---|---|---|
| Mediums | : | రంగుల వాడకాని కుపకరించు సాధనాలు, నీరు, అవిశ నూనె, వార్నిష్ వగైరా. |
| Char coal | : | ఈనాడు పెన్సిల్ వలె పూర్వం చిత్రకారులు ఉపయోగించిన బొగ్గుపుల్ల. |
| Pastel | : | తైల వర్ణాలను చాక్ పీస్‌లాగా చేస్తారు. దానితో చిత్రించవచ్చు. పొడిగా వుంటాయి. |
| Wax Crayons | : | మైనంతో కలిపిన రంగుతో చేసిన కనికెలు. |

Limseed Oil : అవిశ నూనె, తైల వర్ణ చిత్రాలకు వాడే నూనె ఇదే.

Turpentine : నూనె రంగులు వాడిన బ్రష్‌లు కడక్కోడానికి పనికివస్తుంది.

Picture Warnish : తైల వర్ణ చిత్రాల మీద బ్రష్‌తో పూస్తే ఆ చిత్రానికి గాజు అద్దంలాగా మెరుపును, రక్షణను యిస్తుంది.

Round Brush : గుండ్రని కుంచె.

Point Brush : సన్నగా రాసే కుంచె.

Flat Brush : వెడల్పుగా రాసే కుంచె.

Sable Hair Brush : సేబుల్ అనబడే జంతువు వెంట్రుకలతో చేసిన కుంచె.

Squirrel Hair Brush : వుడుత వెంట్రుకలతోచేసిన కుంచె.

Hog Hair Brush : ఏదు పంది వెంట్రుకలతో చేసిన కుంచె.

Easel : పెయింటింగ్‌లు వేసుకోడానికి చేయబడు స్టాండ్.

Drawing Board : డ్రాయింగ్ పేపరును పెట్టుకునే మెత్తని చెక్క పలక

Canvas : ఆయిల్ పెయింటింగ్‌లు వేసుకోడానికి చేయబడు గుడ్డ

Palette : రంగులు కలుపుకొనే చెక్క, లేదా ప్లాస్టిక్ పనిముట్టు.

Palette Knife : పేలెట్ పై ఆయిల్ పెయింట్ కలుపుకొనే చాకు లేదా తాపీ వంటి పరికరము.

Atomizer : వార్నిష్ గాని, ఫిగ్సటివ్‌ని గానీ, చార్‌కోల్ డ్రాయింగ్ మీద లేదా పేస్టెల్ డ్రాయింగ్ మీద స్ప్రే చేసే పనిముట్టు.

Fixative : స్ప్రే చేయబడే ద్రవం.

**Colours : వర్ణాలు, రంగులు.**

Primary Colours : ప్రాథమిక రంగులు, (పసుపు, ఎరుపు, నీలం.)

Secondery Colours }
Complimentary Colours } ప్రాథమిక రంగులు కలుపగా వచ్చిన రంగులు. (అకుపచ్చ, ఊదా, నారింజ రంగులు.)

Opposite Colours : రంగుల చక్రంలో ఎదురెదురుగా వుండే రంగులు. (ఎరుపు×పచ్చ, పసుపు×ఊదా, నీలం×నారింజ.)

Nuetral Colours : రంగులు కాని రంగులు. తటస్త రంగులు. (తెలుపు నలుపు.)

Cool Colours : చల్లని రంగులు. (నీలం, పచ్చ, ఊదా.)

Warm Colours : వెచ్చని రంగులు. (పసుపు, నారింజ, ఎరుపు.)

Body Colours : తెలుపు కలసిన రంగులు.

Opaque Colours : చిక్కని రంగులు, Poster Colours అని కూడా అంటారు.

Transparent Colours : పలుచని రంగులు.
Colour Harmony : రంగుల చక్రంలోని వరుస రంగులు, ఇంద్రధనస్సులాగా
Colour Contrast : రంగుల వైవిధ్యం, తేడా.
Tone, Shade : ఒకే రంగులోని చిక్కన, పలుచన వ్యత్యాసాలు.

**Line : రేఖ**

Straight Line : సరళ రేఖ
Curved Line : వక్రరేఖ.
Vertical Line : నిలువు రేఖ.
Horizontal Line : అడ్డంగా వున్న రేఖ.
Oblique Line : వాలు రేఖ.
Circle : వృత్తము.
Angle : కోణము.

**Theory : సిద్ధాంతము**

Eye level, Horizon : దృష్టి తలము, కంటి ఎత్తున వుండే రేఖ, దిక్ చక్రం, క్షితిజ రేఖ.
Perspective : దృష్టి క్రమం. చిత్రంలో మూడు తలములను , లోతును. దూరాన్ని చిత్రించే సూత్రములు.
Fore Ground : చిత్రంలో ముందలి భాగం. చిత్రంలో అన్నిటి కంటె దిగువన ఉండే భాగం
Back Ground : చిత్రంలో వెనుక భాగం దిక్ చక్రానికి దగ్గరలో వుండే నేల, లేదా నీటి తలం.
Middle Ground : పై రెంటి మధ్యలో వున్న భాగం.
Two Dimentions : పొడవు, వెడల్పు అనబడే రెండు కొలతలు.
Three Dimentions : పొడవు, వెడల్పు, మందం అనబడే మూడు కొలతలు.
Light : వెలుగు.
Shade, Shadow : నీడ, ఛాయ
Halftone : సగం నీడ.
High Light : మెరుపు.
Motif : డిజైన్‌లో ఒక సంపూర్ణ అంశము.
Symmetry : రెండు వైపులా ఒకేలా వుండే డిజైన్.
Asymmetry : రెండు వైపులా ఒకేలా వుండని డిజైన్.
Size, Proportion : కొలత, పరిమాణము.

+1

| | | |
|---|---|---|
| Form, | : | రూపం. |
| Composition | : | కూర్పు, పేర్పు. |
| Anatomy | : | శరీర శాస్త్రం. |
| Chiarascuro | : | వెలుగు నీడల శాస్త్రం. |
| Unity | : | చిత్రంలోని అంశముల ఐక్యత. |
| Balance | : | చిత్రంలోని అంశముల తూకం. |
| Texture | : | పెయింటింగ్ యొక్క తలమును గరుకు గానో, చదును గానో చిత్రిం |
| Silhoutte | : | వెనక వైపున వెల్తురు గలిగి నల్లగా చిత్రించబడే ఆకృతి. |
| Contrast | : | రంగుల లేదా టోన్‌ల వైవిధ్యం. |
| Wash Technique | : | నీరుని ధారాళంగా వాడుతూ వేయబడిన చిత్రం. |
| Knife Technique | : | పేలెట్ నైఫ్‌తో రంగును అద్ది పెయింట్ చేయుట. |
| Modern Art | : | ఆధునిక చిత్రకళ. |
| Traditional Art | : | సాంప్రదాయక చిత్రకళ. |
| Realistic Art | : | వాస్తవ చిత్రకళ. |
| Abstract Art | : | నైరూప్య చిత్ర కళ. |
| Folk Art | : | జానపద చిత్రకళ |



